# భద్రాచలంలో శ్రీ సీతారామ కల్యాణ మహోత్సవం



సీతారామ కల్యాణ మహోత్సవం



శ్రీరాములవారు కల్యాణ మండపానికి తరలివస్తున్న దృశ్యం

[శ్రీరామనవమి సందర్భంలో ఈ కార్యక్రమంపై విజయవాడ కేంద్రనుండి రేడియోసమీక్ష చేయబడినవి]



ప్రయాగ నరసింహ శాస్త్రి
రచన: జనతాలయాలు: జలవిద్యుత్
(రూపకం) విజయవాడ మే 31



ఎస్. ఎస్. శ్రీనివాసన్: వేణువు
[హైదరాబాద్, మే 21]



ఎమ్.ఎమ్. దండపాణి దేశిగర్: గాత్రం
[మద్రాస్, మే 25]



బి. వి. రమణారావు: రచన: భక్త మార్కండేయ (నాటిక) [మద్రాస్, మే 21]



ప్రొ॥ డబ్ల్యూ. టి. వి. ఆదిశేషయ్య: వీరి ఆంగ్ల ప్రసంగం ఇటీవల

**వాణి**
ప్రతినెలా 7, 22 తేదీలలో వెలువడును,
విడి ప్రతి వెల 35 నయాపైసలు,
సంవత్సర చందా రూ. 8-40 పై. (పోస్టేజి సహా)
సంవత్సరమునకు తక్కువ చందా
అంగీకరింపబడదు.
ఇతర వివరములకు:
ఎడిటర్: "వాణి"
ఆల్ ఇండియా రేడియో మద్రాస్-4.
ఫోన్ నెం. 71041 ఎక్స్టెన్షన్స్ 243 & 245




**ALL INDIA RADIO**



సంపుటము XVIII | వాణి 7—5—1967 | సంచిక 24

మన సంస్కృతీ స్రవంతి

# సాంచీ తోరణములు

ఆమంచర్ల గోపాలరావు

సాంచి స్థూపములు వింధ్య కుత్తర మున భోపాలు ప్రాంతమందున్నవి. ఇవి శిలా స్థూపమం దొక ఉపవర్గ మునకు చెందినవి. శాంచి స్థూపవర్గము ఒక చిన్న కొండపైనున్నది. ఈ వర్గ మందు తోరణములు రెండు స్థూపము లకు మాత్రమే నిర్మితములయినవి. ఈ అయిదు తోరణములమీద వెలసిన దివ్య శిల్పశ్రేణియే చారిత్రకముగా తొలి యాంధ్ర శిల్పము.

సంగ చక్రవర్తుల యనంతరము అనగా, దాదాపు క్రీస్తుకు ఒక శతాబ్ది మునకు పూర్వము యీ ప్రాంత మంతయూ ఆంధ్ర చక్రవర్తుల ఏలుబడి లోనికి వచ్చినది. ఆ కాలమందే యీ స్థూప తోరణములు నిర్మితములయినవి. ఈ అయిదు తోరణములందు చిన్న స్థూపములకున్న ఏకతోరణము అతి పురాతనమయినది. ఆంధ్ర శాతకర్ణి చక్రవర్తుల ఆస్థానమునకు చెందిన శిల్పుల స్థపతి ఆనందుడు యీ తోరణ మును నిర్మించినట్లు యీ తోరణముపై నున్న శాసనమును బట్టి తెలియు చున్నది. స్థపతియనగా శిల్పులకు పెద్ద.

నాలుగు దిక్కులందు తోరణములు కలిగిన మహాస్థూపమే ప్రసిద్ధికెక్కిన కానకేడస్థూపము. పూర్వము సాంచి గ్రామ మును సంస్కృతమున కానకేడయనియు, వ్యవహారమున కాకినాడయనియు అను చుండెడివారని యచటి శాసనములవలననే తెలియుచున్నది. వీటిలో ఒక తోరణము కురూర వాస్తవ్యుడగు అచ్చవాడ నాగప్పయ్యగారి ధర్మమనికూడ ఆ శాసనము వలననే తెలియుచున్నది. దీనినిబట్టి పేరునకు ముందు ఇంటి పేరును పెట్టుకొనుట ఆంధ్రులకు అతి ప్రాచీన ఆచారమని మన మనుకొన వచ్చును.

## శిల్ప చిత్రములు

రెండు చతురస్ర స్తంభముల పైన, తరంగముల రీతి మూడు అడ్డపట్టికలను నిలుపుచే యీతోరణముల వాస్తుక్రమము ఈ కంబముల మూలములందు వేదికలు కాని పీఠములుకాని యుండవు. కంబములు నేలనుంచి ఫలకములవరకూ ఒకేరీతి చతు రస్రములు ఈ తోరణములన్నియు, పరి పూర్ణముగా దివ్యశిల్పములచే నలంకృత ములైనవి. వీటిలో ముఖ్యమయినవి గౌతమ బుద్ధుని జీవితమందలి ప్రధాన ఘట్టములు. ఇవి జననము, సంబోధి, ధర్మ చక్ర ప్రవర్తనము మహాపరినిర్వాణము. ఇవి గాక అనేక ఇతర గౌతముని జీవితాంశ ములను, విడి అలంకార శిల్పములను యక్షయక్షిణీ రూపములను మొదలయిన వాటిని కూడ ఆ శిల్పులు చిత్రించిరి. వీ టన్నింటియందునూ గౌతమబుద్ధుని రూప ములు మాత్రమే యీ శిల్పచిత్రముల నలంకరించును.

అశ్వద్ధవృక్షము క్రింద ఒక సింహాసన మును చిత్రించి ఆ శిల్పులు సంబోధిని తెలియజేసిరి, సంబోధియనగా గౌతముని జ్ఞానోదయము ధర్మచక్ర ప్రవర్తన మును సూచించుటకు చక్రరూపమును ఆ శిల్పులు వినియోగించిరి. చక్రమున కిరువైపుల లేళ్ళరూపములను చిత్రించి సారనాథు మృగవనమును ఆ శిల్పులు సూచించిరి. ధర్మచక్ర ప్రవర్తనమనగా, గౌతమబుద్ధుడు మృగవనమునందు చేసిన ప్రథమ ప్రబోధము మహాపరినిర్వాణ మును సూచించుటకు శిల్పులు స్థూపచిహ్న మును వాడిరి, ఒక్కొక్కచోట దేవతలు, యక్షులు, గంధర్వులు, నాగులు, మానవ భక్తులు, ఆ స్థూప రూపమును పరివేష్టించి

## ఈ సంచికలో

ముఖచిత్రం: ముచిలిందుడను నాగరాజు బుద్ధునికి రక్షణ కల్పించుట (నాగార్జునకొండ దృశ్యం)
చిత్రకారుడు: మారేమండ శ్రీనివాసరావు

[బుద్ధపూర్ణిమ సందర్భంలో మే 23వ తేదీన ఆకాశవాణి వివిధ కేంద్రముల నుండి ప్రసారమగు కార్యక్రమములను వినవచ్చును.]

ఉండుదురు. మహాపరి నిర్వాణ మనగా గౌతముని మరణము.

గౌతముని జననమును అనేక చోట్ల భద్రఘటముచే ఆ శిల్పులు సూచించిరి. భద్రఘటమనగా ఘట మందు ఏడు కమలముల గుత్తి. గౌతముడు జన్మించగానే ఏడడుగులు వేసినాడట. అడుగున కొక్క కమల ముద్భవించినదట, అందుచేత ఏడు కమలములు వరుసగా కాని గుత్తిగా కాని ప్రాచీన బౌద్ధ కళయందు గౌతమునిజననమును నిర్దేశించును. గౌతముని జననమును మరొక రీతిని కూడ ఆ శిల్పులు చిత్రించిరి. అదేదన కమలముపై మాయాదేవిని ఉపవిష్టముగా యొనర్చుట. ఒక్కొక్కచోట రెండు ఏనుగులు కుంభములతో నీటిని పోయుచు మాయాదేవిని స్నానము చేయించినట్లు చిత్రించిరి. అనేకమంది పండితులు మొట్టమొదట యీ చిత్రమును లక్ష్మీ చిత్రమని భ్రమసి బౌద్ధ శిల్పములందు లక్ష్మి ఎట్లు అవతరించెనని ఆశ్చర్యపడిరి. కాని కొంతకాలమునకు ఫౌచరు అను ఒక మహా పండితుడు యీ చిత్రము గౌతముని జన్మను సూచించునని కనుగొని చెప్పిరి. ఇవిగాక ఎన్నో ఇతర అలంకార, వినోద శిల్పములను కూడ మనము శాంచి తోరణములపై చూడవచ్చును.

### మహత్తర గుహలు

సాంచి తోరణముల మీద ఉదయించిన ఆంధ్ర కళాప్రసార మతి విశాలమయినది. ఆంధ్రకళ అనాటినుండి క్రమముగా దేశదేశములందు వ్యాపించుటయే గాక, స్వరూపాంతర్గతుల దు సయితము అనంతముగా వికసించినది. కార్లా, కన్హేరీ, అజంతా మొదలయిన అనేక మహత్తర గుహలందు రూపమందికొని చివరకు క్రీస్తుకు తరువాత రెండుమూడు శతాబ్దములందు అమరావతీ స్థూపము మీద పరాకాష్ట నందికొన్నది. అటుతర్వాత ఆంధ్ర కళావ్యాప్తి అపారము. కాని క్రమముగా ఈ మహాకళా స్వరూపము రూపగతులందు క్షీణించి చివరకు తనయందే అంకురించి ప్రజ్వరిల్లిన మహా కళావాహినులయిన ఇతర కళలందు మిళితమయి అదృశ్యమయినది. ఆంధ్రవాస్తు రూపము ప్రథమమున ఉండవల్లి గుహలందు అవతరించి ఆరు ఏడు శతాబ్దములందు మహాబలిపురమందు పల్లవకళగా రూపొంది చివరకు దక్షిణమున ప్రచండ కళావాహిని అయిన ద్రావిడ కళాస్వరూపమందు అంతర్ధానమయినది. పశ్చిమమున ఆరు ఏడు శతాబ్దములందు పల్లవ రూపములందే ఎల్లోరా కైలాస గుహలందు రాష్ట్రకూటుల కళగా రూపొంది; పశ్చిమ చాళుక్య కళాస్వరూపమున ఒక మహా కళావాహినియై, అంతర్దృశ్య మయినది. తూర్పున జావాద్వీపములందు ఆరు ఏడు శతాబ్దములందే బోరబదూరుస్థూపమందు అజంతాలలో నీరసించిన ఆంధ్రశిల్ప శైలిని గంటసాల స్థూప నిర్మాణ క్రమమును పల్లవ వాస్తురూపమును ధరించి యచట ప్రజ్వరిల్లి, చివరకు జావా కళావాహినియందు అంతర్ధాన మయినది. సాంచి స్థూప తోరణముల మీద ఉదయించి అమరావతి వద్ద ఉత్తమగతి నందుకొన్న ఆంధ్ర కళావాహిని ప్రసారము దాదాపు ఏడు ఎనిమిది శతాబ్దములని అనవచ్చును.

# పండిట్ నెహ్రూ తృతీయ వర్ధంతి

ఆకాశవాణి వివిధకేంద్రాలు పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ తృతీయ వర్ధంతి సందర్భమున ఏర్పాటు చేసిన ప్రత్యేక కార్యక్రమముల వివరణ :

**హైదరాబాద్**

| | | | | | |
|---|---|---|---|---|---|
| మే | 27 | శ | మ॥ | 3.30 | చాచా నెహ్రూ: వాడిపోయిన గులాబి: ప్రసంగం, గేయాల |
| ,, | ,, | ,, | రా॥ | 7.30 | గులాబి పరిమళాలు: రూపక రచన. బుచ్చిబాబు |

**విజయవాడ**

| | | | | | |
|---|---|---|---|---|---|
| మే | 27 | శ | సా॥ | 6.30 | నెహ్రూజీ నమస్తే: పంటసీమల శ్రద్ధాంజలి: రూపకం రచన: గుమ్మలూరి సత్యనారాయణ |
| ,, | ,, | ,, | రా॥ | 8.00 | నెహ్రూస్మృతి: గీతమాల |
| ,, | ,, | ,, | ,, | 8.15 | నెహ్రూజీ "గ్లింప్సెస్ ఆఫ్ వరల్డ్ హిస్టరీ"పై ప్రసంగం కందుకూరి రామభద్రరావు |
| ,, | ,, | ,, | ,, | 8.25 | నెహ్రూకు శ్రద్ధాంజలి: పుట్టపర్తి నారాయణాచార్యుల |
| ,, | ,, | ,, | ,, | 8.40 | నెహ్రూ, గాంధీజీ: రూపకం డా॥ లక్ష్మీనారాయణలాల్ హింది రూపకమునకు తెలుగు అనువాదం |

**మద్రాస్**

| | | | | | |
|---|---|---|---|---|---|
| మే | 27 | ,, | ఉ॥ | 9.00 | నవనవ మనిదర్ నెహ్రూపై రూపకము (త. కం రచన: నారాయణన్ |
| ,, | ,, | ,, | ఉ॥ | 1.5 | రోజావిన్ పున్నగై: రూపకం సమర్పణ: గుహన్ |
| ,, | ,, | ,, | రా॥ | 8.00 | Death Anniversary of Nehru Excerpts from Nehru's speeche |

**బెంగుళూరు**

| | | | | | |
|---|---|---|---|---|---|
| మే | 27 | ,, | రా॥ | 8.00 | జవహర్‌లాల్ నెహ్రూ ప్రసంగముల ఆధారముగ ప్రత్యేక కార్యక్రమము సమర్పణ: నారాయణ సంగం |

**తిరుచ్చి**

| | | | | | |
|---|---|---|---|---|---|
| మే | ,, | ,, | రా॥ | 9.15 | Nehru, the internationalist: talk by P. Chandra Redd |

# నిత్యజీవితంలో హాస్యరసఘట్టాలు ఉపన్యాస వేదికలు

సింగరాజు లింగమూర్తి

నవరసాలలో శృంగార రసం ఎంత ప్రధానమైందో హాస్యరసం కూడా అంత ప్రధానమైనదే ఈ రెండూ జీవితానికి దగ్గరలో ఉండేవి. మిగతా రసాలు ఎప్పుడోగాని జీవితంలోకి తొంగిచూడవు. శృంగారం, హాస్యం లేని జీవితం సారంలేని పిప్పిలాంటిది. ఈ రెండూ లేని వ్యక్తులు చాలా సకృత్తుగా ఉంటారు.

హాస్యం తెచ్చి పెట్టుకుంటే వచ్చేది కాదు. సహజంగా ఉద్భవించేదే హాస్యం. తెచ్చి పెట్టుకున్న హాస్యం కృత్రిమంగా, ఎబ్బెట్టుగా ఉంటుంది.

మన పలుకులో, నడకలో, అవయవాలకదలికలో ఒక్కొక్కసారి మనకు తెలియకుండానే హాస్యం విప్పిలుతుంది. అది మనం గమనించలేక పోవచ్చుగాని ఎదుటివారు ఇట్టే గ్రహించి నవ్వేస్తారు. ఈ దృష్టిలో పరిశీలిస్తే నిత్యజీవితంలో హాస్యరస ఘట్టాలు ఎన్నో కనిపిస్తాయి, ఉపన్యాసవేదికల మీద ఇటువంటి హాస్యరస ఘట్టాలు ఎన్నో మనం చూస్తుంటాము.

సభలకు వచ్చే ప్రేక్షకులలో అనేక ప్రవత్తులవారు, మనస్తత్వాలు కలవారూ ఉంటారు. అలాగే వేదికల మీదకు వచ్చే వక్తలూ ఉంటారు. కొందరు వక్తలు వేదికల మీదకు వచ్చేప్పటికి తమను తాము మరచిపోతారేమోననిపిస్తుంది. తామేదో పెద్ద ప్రవక్తలైపోయినట్లు ప్రేక్షకులు కేవలం అజ్ఞానులన్నట్లూ భావించేవారూ ఉంటారు. తాము చెప్పేది ప్రేక్షకులు చచ్చినట్టు విని తీరాలన్న పెంకితనం, తలబిరుసు తనం ఉన్నవాళ్ళూ ఉంటారు. చదువుకొన్నవారూ, మేధావులు కూడా ప్రేక్షకులలో ఉంటారని వీళ్ళు ఎందుకు గ్రహించరో అర్థం కాదు.

## అధ్యక్షస్థానం

అధ్యక్షస్థానంలో ఉన్నవారు తమ ఉపన్యాసాన్ని ఎక్కడ ఆపమంటారో నని ఫుల్‌స్టాపులు, కామాలు లేకుండా ఎక్స్‌ప్రెస్ వేగంలో మాట్లాడేస్తారు కొందరు ఉపన్యాసకులు, ఏమిటీ ఊక దంపుడు ఉపన్యాసమని ప్రేక్షకులు గుసగుసలాడినా అవి ఆ ఉపన్యాసకుని చెవినసోకే వీలుండదు కనుక ఇంకా యమస్పీడుగా ఉపన్యాసం దంచేస్తారు. ఒకవేళ చెవికి సోకినా "వీడిని ఖాతరు చేసేదెవరు" అనుకునే మహానుభావులూ ఉంటారు. ఆ ఉపన్యాసం ఏ రాజకీయనాయకుడిదో అయితే ప్రజలసంగతి ఎట్లా ఉన్నా, పోలీస్, రిపోర్టర్ల దుంపతెగుతుంది. అదే తెలుగు ఉపన్యాసమైతే రిపోర్టర్ ప్రాణం కడబట్టుతుందన్న మాటే. మన తెలుగు సంక్షిప్తలిపి ఉపన్యాస వేగంతో మలచగలిగినంత సులభమైంది కాదు. పోనీ పాయింట్స్ నోట్ చేసుకుందామనుకొన్నా - ఆ ఉపన్యాసంలో అసలు పాయింట్స్ దాడిలేడిస్తేగా, అంతా చర్విత చర్వణం.

ఆత్మస్తుతి-పరనింద- తన మనసులోని భావమేమిటో, తాము చెప్ప దలచుకున్నదేమిటో సూటిగా చెప్పరీ యమస్పీడ్ ఉపన్యాసకులు. అసలు తామేం మాట్లాడుతున్నారో, మాట్లాడవలసిన విషయమేమిటో కూడా విస్మరించే మహాశయులు కూడా ఉంటారు, వినేవాళ్ళకు ఏదో బ్రహ్మాండం బ్రద్దలు చేస్తున్నట్టుగా ఉపన్యాసం ఉన్నా తీరా ఉపన్యాసంముగిశాక ఇంతకూ ఈయన చెప్పినదేమిటి అని ఆలోచిస్తే ఏమీ అంతుచిక్కదు.

## ఎన్నికల ప్రచారం

కొలాన్ని మధ్య బజారునుంచి ఇంటికి వెడుతుంటే దారిలో ఒక బహిరంగసభ తటస్థపడింది. లౌడ్ స్పీకర్‌లో సినిమా రికార్డులు చెవుల్ని హోరెత్తిస్తున్నాయి. అసలు సభ ఏమిటని వాకబ్ చేద్దామని అడిగితే ఎన్నికల ప్రచారసభ అన్నాడు. వాళ్ల చెప్పేది ఏమిటో అన్నదాతలకు తెలిసినా అయినా అసలు ఎవరెవరు మాట్లాడుతారో కాసేపు వాదాడుకొని ఓ పెడగా నిలబడ్డాను.

ఆ సినిమా రికార్డులు వింటుంటే అనిపించింది - ఎన్నికల ప్రచారసభ కదా. ఏ దేశభక్తి గీతాలో పెట్టించ రాదా అని ఇంతలో ఓ గొంతు మైకులో ఖంగున మ్రోగింది. అంతా నిశ్శబ్దంగా ఉండండి-సభ ప్రారంభమౌతున్నది" అని.

బాలికల దేశభక్తిగేయం తర్వాత ఒక డింభకుడు మైకుముందు నిలబడి "ప్రజలారా" అన్నాడు నాకు కొంత ఎడంగా నిలబడిన వారిలో ఒకాయన తోడివాళ్ళతో "ప్రజలంకాక ఎవరైనా మృగాలనుకుంటారనేమిటి ప్రజలారా! అంటున్నాడు. అన్నాడు, అమాంతే కొద్దితేడాతో "మేం ప్రజలమైతే మీరు మృగాలా" అన్నాడు పెద్దగానే, కిసుక్కున నవ్వాడొకడు, పురిటిలోనే సంధికొట్టినట్లు ఉపన్యాసానికి ఆదిలోనే హంస పాదా అనుకున్నాను.

ఆ ఉపన్యాసకుడు తక్షణం బెదిరి వెంటనే సర్దుకొని అయ్యా! మీరంతా విజ్ఞానవంతులు నేను చాలా చిన్నవాడిని, యూనివర్సిటీలో చదువుకుంటున్నాను. నాకీ పార్టీమీద ఉన్న అభిమానంతో ఇందులో చేరాను. ఈ పార్టీ సిద్ధాంతాలను గూర్చి మీకు మనవి చేస్తాను, అని చెప్పుకుపోతున్నాడు.

"ఏడ్చినట్టే ఉంది." అన్నాడొకడు. "విజ్ఞానవంతులకు ఈ అజ్ఞాని చెప్పేదేమిటి" అన్నాడు మరొకడు, "తన చదువేదో సంధ్యేదో ఏడ్చుకోక ఈ పార్టీలు రాజకీయాలు అఘోరించడం దేనికో?" అని ఒక విద్యార్థి తండ్రి కాబోలు వాపోతున్నాడు. ఈ విసుర్లన్నీ వేదికవద్దకూ పోలేదు కనుక ఆ డింభకుడు ధాటీగా మాట్లాడేస్తున్నాడు. ఒకప్రక్క వాళ్ళు అంటున్న మాటలకు నవ్వు మరో ప్రక్క ఆ డింభకుడిమీద జాలి, పార్టీ వాళ్ళమీద ఏదో



రాగం, తానం పల్లవి. షేక్ హుస్సేన్. క్లారినెట్
[హైదరాబాద్ మే 26]

తెలియని సానుభూతి నాతో కలిగాయి.

## సాహిత్యసభలు

ఒకసారి ఓ సాహిత్యసభకు వెళ్ళడం జరిగింది. కార్యదర్శి అందరికీ స్వాగతం పలికి ఉపన్యాసాల తర్వాత ఫలాని ఫలాని వారి కావ్యగానంకూడా ఉందని సెలవిచ్చాడు. ఉపన్యాసాలతో బోరెత్తినవారికి కాస్త రిలీఫ్‌గా కావ్యగానం ఏర్పాటు చేయడం బాగానే ఉందనుకున్నారు కొందరు. తలనొప్పి మందేమైనా అవసరమౌతుందేమో కార్యదర్శికి చెప్పండి-కొన్ని సీసాలు తెప్పించమని" అన్నాడొకాయన. ఇంతలో సభాధ్యక్షులు మైకు ముందుకు జరుపుకొని "సదస్సులందరికీ నమస్కారములు. ఉపన్యాసాలు, ఆ తర్వాత కావ్యగానం ఉంది కాబట్టి నా ప్రారంభోపన్యాసంతో మిమ్మల్ని విసిగించకుండా సభ ప్రారంభిస్తాను. చివరలో నా ఉపన్యాసం కొనసాగిస్తాను. ఉపన్యాసకులు, కవులు ఎక్కువ ఉన్నారు కాబట్టన్నీ మనకు ఉన్న సమయం తక్కువ కాబట్టి ఉపన్యాసానికి పదినిమిషాలు. కావ్యగానికి అయిదు నిమిషాలు ఒక్కొక్కరికి కేటాయిస్తున్నాను." అన్నాడు ఆయన ప్రకటన ఉపన్యాసకులలోను, కవులోను కాస్త అలజడికలిగించింది. ఏవో గుసగుసలు ప్రారంభించారు.

ఒక వక్త కులుకుతూ పెళ్ళికూతురిలా మైకు ముందరకు వస్తుంటే నా పక్కన కూర్చునాయనతో వెనుక వరుసలో కూర్చున్నాయన అంటున్నాడు "మన నాటకంలో హీరోయిన్ దొరక్క చస్తున్నాం. మొగవాళ్ళు ఆడవేషాలు వేయక చాలా రోజులైంది బుక్ చేద్దామేమిటి?" అని, "ఈ రోజున కాలేజీలో చదివే కొందరమ్మాయిలు, ఉద్యోగాలు చేస్తే కొందరాదాళ్ళూ యీయనదగ్గర కులకటం నేర్చుకుంటే బాగుండు" అంటున్నాడు ఇంకొక ఆయన.



నేతి శ్రీరాములమ్మ : [హైదరాబాద్, మే 31]

"నేను మాట్లాడవలసిన విషయం చాలా విస్తృతమైంది. దాన్ని పదినిమిషాల్లో కుదించడం కష్టమే అయినా త్వరలో ముగించడానికి ప్రయత్నిస్తాను. అసలు నేను చెప్పనలచుకొన్న విషయం " అని ప్రారంభించాడు, ఎనిమిది నిమిషాలైంది, ఇంతవరకు ఆయన ఉపన్యాసాన్ని గురించిన ఉపోద్ఘాతంతోనే సరిపోయింది. ఇక రెండు నిమిషాలుందని అధ్యక్షుడు హెచ్చరించాడు.

"ప్రేక్షక మహాశయులారా! ఈ మైంనిబంధన ఉపన్యాసకులకు కళ్ళెం లాంటిది. రౌతు కళ్ళెంలాగుతుంటే గుఱ్ఱం ఏం చేస్తుంది పాపం! మరోసారి ఎప్పుడైనా నా ఉపన్యాసం మీకు వినిపిస్తాను" అని ఆ ఉపన్యాసకుడు వెనుదిరుగుతుంటే చివరివరసలో కూర్చున్న ఓ విద్యార్థి "మీ ఉపమానం బాగుంది సార్! ఈ మహాపట్టణంలో గుర్రం సకిలింపుకు ముఖం వాచిపోయాం ఏదీ ఒక్కసారి . అనేప్పటికి సభికులు గొల్లుమని నవ్వారు. "టైం లేదుగ అయినా ఇంతమంది సకిలించారు. అందులో గుర్రం సకలింపు ఉందేమో మీరే పోల్చుకొండి" అని ఆ ఉపన్యాసకుడు తన స్థానంలో వెళ్ళి కూర్చొన్నాడు "ఆ కులుకు చూసి మనిషే అనుకున్నా. ఫర్వాలా గట్టివాడే" అన్నాడొకాయన.

ఇంకో వక్త రాజరీవినంతా ఒలకపోస్తూ మైకు దగ్గరకువస్తుంటే "రవి తేజము లరయగ జూ వెడలె సభకు" అని మధ్యవరుసలో కూర్చున్న వారిలోంచి ఎవరో కూనిరాగం తీశాడు. నిజంగా ఆయన మాట్లాడటం కూడా అంత రీవిగాను మాట్లాడాడు

## కవి సమ్మేళనాలు

"అసలు ఈ సమావేశం ఏర్పాటు చేసిన కార్యనిర్వాహకులకు మతి లేనట్లుంది. ఉన్నట్లయితే ఉపన్యాసాలతో పాటు కవి సమ్మేళనమేమిటి నాచేతేలాగో, ఉపన్యాసాలు ఒక రోజున కవి సమ్మేళనం ఒకరోజున ఏర్పాటు చేసే బాగుండేది, పదినిమిషాలలో ఉపన్యాసం పూర్తిచేయాలంటే ఏదులో విషయం ఏం చెబుతారు. ఐదు నిమిషాలలో ముగించే కవిత్వంలో మీరు రసాస్వాదనం ఏంచేస్తారు? ఏదో సభ జరిపాం అని కార్యనిర్వాహకులు తృప్తిపడి పత్రికల్లో వేయించుకోడం తప్పితే ప్రయోజనం ఏమీ లేదు. నా దగ్గరకు కార్యదర్శి వచ్చినప్పుడు చెప్పాను. గంటకు తక్కువ మాట్లాడనని, అధ్యక్షుడు పదినిమిషాలన్నాడు. నేను ఉపన్యాసం చేయదలచుకోలేదు. ఈ నాలుగు మాటలు చెబుదామనే మైకు దగ్గరకు వచ్చాను. ఇక ముందెప్పుడూ గూడా ఉపన్యాసకులకు, కవులకు ఇటువంటి ఇబ్బంది కలిగించకుండా సభలు ఏర్పాటుచేస్తే బాగుంటుందని తెలుపుతూ విరమిస్తున్నాను, అన్నాడు "బ్రతికించాడు-గంటసేపు తోచకుండా" అనుకున్నారు కొందరు.

సాహిత్య సమావేశాలలో ఇటువంటి అవకతవకలు ఎన్నో జరుగుతుంటాయి.

ఈనాటి సమాజజీవితం అనేక సమస్యలతో చిక్కులతో వేదనా భరితంగా ఉంటున్నది జీవితం మీద విసుగు, పలాయనతత్వం సామాన్యులలో కలుగుతున్నది. వీరినుంచి రిలీఫ్ పొందడానికి ఏ వినోదమో కావాలనుకుంటాడు ఆ వినోదం కొనుక్కోడానికి డబ్బు కావాలి మధ్య తరగతి వాడు డబ్బుతో వినోదాన్ని కొనుక్కోలేకపోతున్నాడు. అటువంటి వారికి ఉపన్యాసవేదికలు బోలెడంత విజ్ఞానంతోపాటు వినోదాన్ని కూడా ఇవ్వగలుగుతాయి. పరిశీలనగా చూస్తే నిత్య జీవితంలో హాస్యరస ఘట్టాలు ఎన్నో కనిపిస్తాయి. వాటి లోపంచే మధ్య తరగతి జీవి హాస్యం రుచిచూడాలి వినోదాన్ని అందుకోవాలి.

సంగీత రూపకం

# నాదోపాసన

రావూరి భరద్వాజ

నాదం నిత్య నూతనమైనది. దానికి జనన మరణాలు లేవు. నాదమే పరబ్రహ్మ స్వరూపమనే మతం కూడా ఉన్నది. ఈ నాదం ద్వివిధం; వర్ణాత్మకమూ ధ్వన్యాత్మకమూనని.

'అ ఇ ఉణ్ ఋ ఌక్' ఇత్యాది మాహేశ్వర సూత్రాల వల్ల ఆ జ్యోతి ఖాగాన్ని పొంది, వేదవేదాంగాలకూ, సమస్త వాఙ్మయానికీ, మూలవిరాట్టుగా పరిణమించింది వర్ణాత్మకనాదం.

ధ్వన్యాత్మకనాదం - ఆహతమూ, అనాహతమూ, అని రెండు విధాలు.

ఇందులో అనాహతనాదం, రేచక పూరకాల వల్ల మూలాధార స్వాధిష్ఠాన మణిపూరాది చక్రాలకు నాదాన్ని రేపి, మహాయోగులకు, మోక్షసాధన మవుతున్నది.

రెండవదైన ఆహతనాదం, నాద తరంగాలను, కర్ణగోచరం చేసి, 'ఆనందో బ్రహ్మ' మన్న సూత్రాన్ని సమన్వయం చేయగల, సంగీత పథానికి మూలవిరాట్ అవుతున్నది.

ఆహత అనాహతనాదాలు రెండింటినీ ఆరాధించి, సమన్వయించి, అవాఙ్మానస గోచరమైన ఆనంద స్వరూపాన్ని అందుకోగలిగిన దేవతలు, నారదాది మునులు చూపిన మార్గమునే నాదయోగి త్యాగరాజస్వామి దర్శించి, ఇలా అంటున్నారు.

నాదోపాసనచే శంకరనారాయణవిధులరా
వెలసిరి యో మనసా॥
వేదోద్ధరులు. వేదాతీతులు
విశ్వమెల్ల నిండియుండేవారలు॥

మంత్రాత్ములు, యంత్రతంత్రాత్ములు మరి —

మన్వంతరము లెన్నో గలవారలు
తంత్రీలయస్వరగాన విలోలురు త్యాగ
రాజవంద్యులు, స్వతంత్రులు,

(బేగడ, దేశాది)

నాదోపాసకులైన త్యాగరాజస్వామి విమలహృదయంతో, ప్రణవస్వరూపుడైన పరమేష్ఠిని నాదస్వరూపునిగా దర్శించగలిగారు. అది చూపుతుంది ఈ కీర్తనలో,

నాదతనుమనిశం శంకరం
నమామి మే మనసా శిరసా॥
మోదకర నిగమోత్తమ సామ
వేదసారం వారం వారం
సద్యోజాతాది పంచవక్త్రజ
సరిగమపధనీ వర సప్తస్వర
విద్యాలోలం, విదళితకాలం
విమలహృదయ త్యాగరాజపాలం

(చిత్తరంజని-ఆది)

స్వరములు, 'ఆరు-ఒకటి' అన్నారే గాని; 'సప్తస్వరములు' అని ఇక్కడ చెప్పలేదు అయ్యవారు షడ్జమ స్వరాన్ని ప్రకృతి స్వరమని, మిగిలిన ఆరు స్వరాలను, వికృతి స్వరాలని; సూచిస్తున్నారేమో! నాదమును, 'దండ'తో పోల్చడమూ ని తిగతిరస్కరణడమూ, స్వరములను ఘంటలనడమూ, గమనిస్తే; యాగసంరక్షణార్థం, విశ్వామిత్రుని అనుసరిస్తున్న శ్రీరామచంద్రునిమూర్తిని, సంగీత సమన్వయంచేసి, ఈ కీర్తనలో భక్తలోకానికి అందించారేమో!

నాదసుధారసంబిలను, నరాకృతాయె
మనసా॥
వేదపురాణాగమ, శాస్త్రాదుల
కాధారమౌ॥
స్వరములు యారొక ఘంటలు
వరరాగము కోదండము
దురనయదేశ్యము త్రిగుణము
నిరతగతి శరము ॥
సరససంగతి సందర్భముగల
గిరములురా
ధరభజనే భాగ్యమురా త్యాగరాజు
సేవించు ॥

(ఆరభి-రూపకం)

జీవాత్మస్వరూపమైన కమలంపై, పరతత్త్వమైన భ్రమరం విహరించాలి గానీ, ఒక భాకాలు గంతులు వేసినందువల్ల ప్రయోజనమేమి? అని—మద్దెల, తాళగతులు తెలియక, మర్దించడం, ఎటువంటిదో, ఇదీ అటువంటిదే నంటున్నారు ఓంకారధ్వనికి ప్రతీకమైన మృదంగాన్ని ఉదహరించడంలో, అయ్యవారి చమత్కారం, అనన్యం,

స్వరరాగ సుధారసయుతభక్తి
స్వర్గాపవర్గమురా ఓ మనసా
మూలాధారజ నాదమెరుగుటే
ముదమగు మోక్షమురా॥
కోలాహల సప్తస్వరగృహముల
గురుతే మోక్షముగా ఓ మనసా॥
మద్దెలతాళగతులు తెలియకనే
మర్దించుట సుఖమా.

శుద్ధ మనసులేక భజన చేయుట
సూకరవృత్తిరా ఓ మనసా॥
ఆహా తన్ను మరచి పైజ్ఞానియై
దిగుట మోక్షమురా
సహజభక్తితో రాగజ్ఞానసహితుడు
ముక్తుడురా ఓ మనసా ॥
రజతగిరీశుడు నగజకు దెల్పిన
స్వరార్ణవమర్మములు విజయముగల
త్యాగరాజెరుగే
విశ్వసించి తెలుసుకో మనసా ॥

(శంకరాభరణం-ఆది)

మతంగాది మహర్షుల అడుగు జాడలలో పయనించినా విశ్వనాథ ఆత్మిక సాధనంగా పొందగలిగిన స్వామివారు సంగీతజ్ఞానము భక్తి వినా సన్మార్గము లేదంటున్నారు.

సంగీతజ్ఞానము భక్తి వినా సన్మార్గము
కలదె మనసా
భృంగి నటేశ సమీరజ ఘటజ
మతంగ నారదాదులుపాసించే॥
న్యాయాన్యాయము దెలుసును జగములు
మాయామయమనె దెలుసును దుర్గుణ
కాయజాదిషడ్రిపుల జయించే
కార్యము దెలుసును త్యాగరాజునికే ॥

(ధన్యాసి-దేశాది)

శ్రీరామచంద్రమూర్తిని ఇష్టదైవంగా ఆరాధించిన త్యాగరాజస్వామి, వినయమయుతమైన ప్రేమ విశ్వాసంతో కూడిన భక్తి, సద్యశస్సు, తోడి సుజన వాత్సల్యము, పొంది; సారూప్య సౌఖ్యానికి, సంగీతమార్గంలో పయనించి, తమకు కలిగిన ఈ మహదానుభూతిని సకలజనులకూ ఎలా లభ్యమవుతుందో, ఈ కీర్తనలో తెలియచేశారు

సంగీతశాస్త్రజ్ఞానము సారూప్యసౌఖ్య
దమే మనసా॥
శృంగారరసాద్యఖిలసారపూరిత రామ
కథానందాబ్ధియుత॥
ప్రేమభక్తి సుజనవాత్సల్యము
శ్రీమద్రమావరకటాక్షము
నేమనిష్ఠ యశోధన మనగునే వేర్పు
గల్గు త్యాగరాజు నేర్చిన॥

(ముఖారి-దేశాది)

పంచభూతాత్మకమైన శరీరంలో, జనించి ద్రష్టలకు మాత్రం గోచరించే సప్తస్వరముల సౌందర్యమును దర్శించి, ఉపాసించి, తరించిన నాదయోగి, త్యాగరాజస్వామి

శోభిల్లు సప్తస్వరసుందరుల భజింపవే
మనసా॥
నాభీహృత్కంఠ రసననాసాదుల
యందు॥
ధర ఋక్సామాదులలో వరగాయత్రీ
హృదయమున
సురభూసుర మానసమున శుభత్యాగ
రాజాదులలో॥

అయ్యవారికాలంలో కూడా సంగతి, సందర్భం, యతివిరామ శృంగారాదినవరసయుత భక్తి, సుస్వర సంగీత సౌందర్యరక్తి; మరచిన వాగ్గేయకారుల సంగీత రచనలు, వినిపించటమూ ఉండేదేమో అనిపిస్తుంది. అయ్యవారి ఈ కీర్తన వింటే :

సొగసుగా మృదంగతాళము
జతగూర్చి నిను
జొక్కజేయు ధీరుడెవ్వడో॥
నిగమ శిరోర్థముగల్గిన
నిజవాక్కులతో స్వరశుద్ధముతో॥

(తరువాయి 44వ పుటలో)

# ప్రసారవిశేషాలు

## యుగయుగాలలో హిమాలయం

(ప్రసంగం)

హిమాలయ పర్వతములు హిందూ దేశపు సంపద. పురాణములు, చరిత్ర అన్నియు హిమాలయములను పేర్కొనుచున్నవి. హిమాలయములు కవులకు శాంతిని కలిగించు విడిది స్థలము "యుగయుగాలలో హిమాలయం"ను గూర్చి మే॥ 31వ తేదీ రా॥ 7-45 లకు వి. శ్రీరామ చంద్రుడు ప్రసంగించెదరు

## జీవనరాగము

(నాటిక)

రచయితయగు సత్యం ఒక అనాధకు ఆశ్రయమిచ్చి, ఆమెనే వివాహమాడును. కొన్నాళ్ళ తర్వాత సత్యం ధనమునకు ఆమెపై ఆధారపడవలసి వచ్చును. ఆ కారణంచే ఆమె ఆతనిని వదలి వర్కింగ్ సు ఆశ్రయించును. సత్యం ఆమె మరల తిరిగి వచ్చుట కు ఇష్టపడినను ఆమె తిరిగివచ్చుటకు ఇష్టపడదు. శివం రచించిన "జీవన రాగము" అను నాటికను హైదరాబాద్ కేంద్రం మే 24వ తేదీ రా॥ 9.00లకు వినవచ్చును. ఈ నాటికను మద్రాస్, విజయవాడ కేంద్రములనుండికూడ వినవచ్చును.

## పెద్దలమాటపై విలువ

(ప్రసంగం)

పెద్దలమాటలకు విలువనిచ్చుట హిందూమత సాంప్రదాయమైనా ప్రస్తుతము యువతీ యువకులు పెద్దల మాటలపై లేరు. దీనివలన సమిష్టి కుటుంబములు క్షీణించుచున్నవి. ఏల వారు పెద్దలమాటలను లెక్క పెట్టుటలేదు అను సమస్యను గూర్చి ప్రమదావనం మండలి, శ్రీ మండలి సభ్యురాండ్లు చర్చించుటను మే 31వ తేదీ మ॥ 1-00 లకు హైదరాబాద్ కేంద్రంనుండి. స్త్రీల కార్యక్రమములో వినవచ్చును.

## సంధ్య

(నాటిక)

ఒక యువతి ఎంత ఉన్నత స్థితిలో నున్నప్పటికిని మానవేచ్ఛలనుండి తప్పించుకొనజాలదను నీతి కలవు నాటికయే "సంధ్య" శంకరకురూప్ మలయాళమున రచించిన ఈ నాటికను బి. వి. శ్రీనివాసాచార్యులు తెలుగులో అనువదించిరి ఈ నాటికను మే 17వ తేదీ రా॥ 9.00లకు విజయవాడ హైదరాబాద్, మద్రాస్, కడప, విశాఖపట్టణ కేంద్రముల నుండి వినవచ్చును.

## శ్రేయోభిలాషి-కెన్నెడీ

ఉన్నతవంశీయుడగు జాన్. ఎఫ్. కెన్నెడీ గొప్ప రాజకీయ వేత్తగా పేరొందిన అధ్యక్షుడు, ప్రజల శ్రేయోభిలాషి. దేశ పురోగతి, సర్వమానవ సమానత్వమునకు పోరాడి, తన ప్రాణములనే దారవోసిన త్యాగమూర్తి. ఈయన 50వ జన్మదినోత్సవ సందర్భమున మే29వ తేదీ రా॥ 8 00లకు విజయవాడ కేంద్రమునుండి శ్రేయోభిలాషి కెన్నెడీ అను విషయంపై ప్రసంగమును వినవచ్చును.

## అఖిలభారత సంగీత కార్యక్రమం

శరణ్ రాణి ఉస్తాద్ అల్లాఉద్దీన్ ఖాన్ ఆతని కుమారుడగు అలీ అక్బర్ ఖాన్ సరోద్ వాద్యము నేర్చుకొన్నది. రాగభావ ఆలాపనలు అతి మధురముగా వాయించెడి నేర్పుకలది. విదేశములకు కూడా పోయి అనేక కచేరీలను చేసి కీర్తి గడించినది. ఈమె సరోద్ వాద్యకచేరీని అఖిల భారత సంగీత కార్యక్రమములో మే 20వ తేదీ రా॥ 9.30లకు వినవచ్చును.

అఖిల భారత సంగీత కార్యక్రమమున మే 27వ తేదీ రా॥ 9.30 లకు శాంతివనములోని వాద్య సంగీతమును (నెహ్రూజీ మూడవ వర్ధంతి సందర్భమున) వినవచ్చును

## కొండా వెంకటప్పయ్య పంతులు

నవయుగ నిర్మాతలలో శ్రీ కొండా వెంకటప్పయ్య పంతులు ముఖ్యులు. ఆంధ్రదేశ స్వాతంత్ర్యమునకై పాటుపడిన వారిలో ముఖ్యులు. కీర్తి విశాలముగా ఇతరులకు మార్గదర్శిగానుండెడివి. గాంధీ మహాత్ముని పూజించిన వారిలో ఒకరు గొప్ప సంఘ సంస్కర్త. మే 28వ తేదీ రా॥7.45లకు హైదరాబాద్ కేంద్రంనుండి శ్రీ వెంకటప్పయ్య పంతులను గూర్చి కె. నారాయణరావు ప్రసంగించెదరు

## అన్నపూర్ణ

(నాటిక)

ఒక కుటుంబములో సోదరీ సోదరుల మధ్య అనుమానాలు చెలరేగును. కుటుంబంలోని పెద్దవారి శాంతముతో, ఓపికలతో, చివరకు ఆ కుటుంబమున సుఖ శాంతులు నెలకొనును. బలివాడ కాంతారావు రచించిన "అన్నపూర్ణ" అను నాటికను విజయవాడ కేంద్రంనుండి మే 22వ తేదీ రా॥ 9.30 లకు వినవచ్చును,



చెలికుమిల్లి భాస్కరరావు: రచన: షిరీన్—ఫర్‌హాద్ (నాటిక)
[హైదరాబాద్, మే 21]



డా॥ కె. సుబ్బారావు: క్యాన్సరువ్యాధిపై ప్రసంగం
[ఆటికలు హైదరాబాద్ కేంద్రం నుండి ప్రసారం]

## మద్రాస్-బి

(వివిధ భారతి)

193.5 (1550 కిలో సైకిళ్లు)

వారములో అన్ని రోజులు (శనివారం మినహా)

ఉ॥ 7.00 నుండి 9.30

10.15 నుండి 12.30

మ॥ 2.00 నుండి 5.30

సా॥ 6.30 నుండి 10.[illegible]

(శనివారములు మాత్రం రాత్రి 6.30 నుండి 11.10)

[వివరాలు [illegible]-వ పేజీలో]

## హైదరాబాద్-బి

వివిధభారతి (రిలే)

ఉ॥ 7.00 నుండి 9.30

10.15 నుండి 12.30

మ॥ 2.00 నుండి 5.30

సా॥ 6 30 నుండి 10 40

(శనివారములు మాత్రం రాత్రి 6.30 నుండి 11.10)

[వివరాలు [illegible]-వ పేజీలో]

## తిరుచ్చి-బి

302.7 మీ.(1430 కిలో సైకిళ్లు)

వివిధభారతి (రిలే)

ఉ॥ 7.00 నుండి 9.30

10.15 నుండి 12 30

మ॥ 2.00 నుండి 5.30

సా॥ 6.30 నుండి 10.40

(శనివారము సా॥ 6.30 నుండి రా॥ 11.10 వరకు)

[వివరాలు [illegible]-వ పేజీలో]

## దేశరక్షణ: ప్రత్యేక వార్తా ప్రసారాలు

ప్రతిదినము ఉదయం 6.40 ప్రత్యేక వార్తా ప్రసారము

(ఢిల్లీ కేంద్రమునుండి ప్రసారమగు ఈ కార్యక్రమము మద్రాస్-బి, హైదరాబాద్ ఎ, విజయవాడ, తిరుచ్చి, బెంగుళూర్ కేంద్రములు రిలే చేస్తాయి.)

వారంలో శనివారము తప్ప మిగతా రోజులలో

ప్రతిరోజూ రా॥ 10.30 గంటలకు ప్రత్యేక వార్తా ప్రసారము

శనివారం రా॥ 11.00 ప్రత్యేక వార్తా ప్రసారము

ఢిల్లీ కేంద్రమునుండి ప్రసారమగు పై రెండు కార్యక్రమాలు హైదరాబాద్ ఎ విజయవాడ, మద్రాస్ బి, తిరుచ్చి, బెంగుళూర్, కేంద్రములు రిలే చేస్తాయి.

## వివిధ భాషలలో వార్తా ప్రసారాలు

### తెలుగులో

ఉ॥ 7.00 నుండి 7.15 వరకు

మ॥ 1.50 నుండి 2.00 వరకు

సా॥ 7.00 నుండి 7.15 వరకు

### హిందీ

ఉ॥ 6.35 నుండి 6.40 వరకు

ఉ॥ 8.15 నుండి 8.30 వరకు

ఉ॥ 10.50 నుండి 10.55 వరకు

మ॥ 1.40 నుండి 1.50 వరకు

మ॥ 3.35 నుండి 3.40 వరకు

సా॥ 6.05 నుండి 6.10 వరకు

రా॥ 8.15 నుండి 8.30 వరకు

రా॥ [illegible] నుండి [illegible] వరకు

ర॥ 10.40 నుండి 11.55 వరకు

[శనివారాలలో రా॥ 11 05 నుండి 11 10 వరకు]

### ఇంగ్లీషు

ఉ॥ 6.40 నుండి 6.45 వరకు

ఉ॥ 8.00 నుండి 8.15 వరకు

ఉ॥ 10.55 నుండి 11.00 వరకు

మ॥ 1.30 నుండి 1.40 వరకు

సా॥ 6.00 నుండి 6.05 వరకు

రా॥ 9.00 నుండి 9.15 వరకు

రా॥ 10.30 నుండి 10.35 వరకు

[శనివారాలలో రా॥ 11.00 నుండి 11.05 వరకు]

### తమిళం

ఉ॥ 7.15 నుండి 7.30 వరకు

మ॥ 2.00 నుండి 2.10 వరకు

సా॥ 7.[illegible] నుండి 7.[illegible] వరకు

## మంగళ మే 16

శక 1889 వైశాఖ 26

## హైదరాబాద్-ఏ

416.7 మీ (720 కిలోసై)
ఉ॥ 6.00 నుండి 11.02 వరకు
మ॥ 11.55 నుండి 2.10 వరకు
సా॥ 5.30 నుండి రా॥ 11.00 వరకు
60.98 మీ (4920 కిలోసై)
ఉ॥ 6.30 నుండి 9.15 వరకు
41.90 మీ (7160 కిలోసై)
మ॥ 11.55 నుండి 4.30 వరకు
60.98 మీ (4920 కిలోసై)
సా॥ 6.45 నుండి రా॥ 11.00 వరకు

ఉ॥ ప్రసారము I

405.4 మీ (740 కిలోసై)

6.00* వందేమాతరం, మంగళధ్వని కార్యక్రమ వివరణ
6.10 భక్తిరంజని (విజయవాడనుండి రిలే)
6.40 ఆంగ్లములో వార్తలు
6.45 సూక్తి ముక్తావళి
6.50 వాద్య గోష్ఠి: నిలయ విద్వాంసులు
7.00 తెలుగులో వార్తలు
7.15 విజయవాడ వలె
7.45 సుగమ సంగీత్‌
8.00 ఆంగ్లములో వార్తలు
8.15 హిందీలో వార్తలు
8.30 విజయవాడ వలె
9.03* వాతావరణసూచన ప్రసారం

మ॥ ప్రసారము II

12.30 కార్మికుల కార్యక్రమము: పాటలు
భీమా సౌకర్యాలు: ప్రసంగం
ఉత్తరాలనంచి
1.00 వనితావాణి (విజయవాడనుండి రిలే)
1.30 ఆంగ్లములో వార్తలు
1.40 చిత్రసీమ †
1.50 తెలుగులో వార్తలు
2.00 వాతావరణసూచన, పాకాల సావిత్రీదేవి
2.30* ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము III

5.30* స్థానిక ప్రకటనలు
5.35 విజయవాడ వలె
6.00 ఆంగ్లములో వార్తలు
6.05 ప్రాంతీయ వార్తలు
6.15 ప్రాంతీయ వార్తలు (హైదరాబాద్, కడపలు మాత్రమే)
6.25 ముఖ్యప్రకటనలు. విరామ సంగీతం
6.30 గ్రామస్థుల రేడియో గోష్ఠి
ప్రశ్నోత్తర వేదిక
చేనలవేళ: సంభాషణ
ధరలు, వాతావరణము
7.00 తెలుగులో వార్తలు
7.15 తెలుగుబాట
7.30 రేడియో వార్తావాహిని
7.45 మన విద్యాసౌకర్యాలు: ప్రసంగం
పి. ఆదినారాయణ
7.55 విరామ సంగీతం
8.00 మీరు కోరిన పాటలు †
8.30 Radio News Reel (relay from Delhi)
8.40 పాకాల సావిత్రీదేవి
9.00 ఆంగ్లములో వార్తలు
9.15 ఢిల్లీనుండి రిలే
9.20 ఢిల్లీనుండి రిలే
9.30 విజయవాడ వలె
10.30 ఆంగ్లములో వార్తలు
10.35 హిందీలో వార్తలు
10.40 వాతావరణసూచన, జనగణమన, ప్రసార సమాప్తి

## కడప

333.3 మీ (900 కిలోసై)
సా॥ 5.30 నుండి రా॥ 10.40 వరకు
శనివారములు మాత్రము
సా॥ 5.30 నుండి రా॥ 11.10 వరకు

## విశాఖపట్నం

322.6 మీ (930 కిలోసై)
సా॥ 5.30 నుండి రా॥ 10.40 వరకు

## విజయవాడ

357.1 మీ (840 కిలోసై)

ఉ॥ ప్రసారము I

6.00* వందేమాతరం, శుభోదయం, ప్రసార విశేషాలు
6.10 భక్తిరంజని: భీష్మస్తవం
భగవద్గీతా వైభవం
6.40 ఆంగ్లములో వార్తలు
6.45 సూక్తి ముక్తావళి (హైదరాబాద్‌నుండి రిలే)
6.50 బజారు ధరలు
6.55 విరామ సంగీతం
7.00 తెలుగులో వార్తలు
7.15 వై. సుబ్రహ్మణ్యం: వేణువు
7.45 సంగీత శిక్షణ (జూనియర్లకు)
8.00 ఆంగ్లములో వార్తలు
8.15 హిందీలో వార్తలు
8.30 ఎస్. సి. జగన్నాథాచార్యులు
9.00* ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

12.30 కార్మికుల కార్యక్రమము (హైదరాబాద్‌నుండి రిలే)
1.00 వనితావాణి
స్త్రీల కార్యక్రమం
పాట
మన సమాజము—వివాహాలు, ప్రసంగం
వార్తావళి, మంగళం
1.30 ఆంగ్లములో వార్తలు
1.40 హిందీలో వార్తలు
1.50 తెలుగులో వార్తలు
2.00 వాతావరణ సూచన, ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము III

5.30* స్థానిక ప్రకటనలు
5.35 లలిత సంగీతం
ఎమ్. వి. రమణమూర్తి
5.45 పురాణ కాలక్షేపం: భాగవతమునుండి
6.00 ఆంగ్లములో వార్తలు
6.05 ప్రాంతీయ వార్తలు
6.15 వాద్య బృందం
6.25 ముఖ్య ప్రకటనలు, విరామ సంగీతం
6.30 పంటసీమలు
ప్రశ్నలూ, జవాబులూ
గ్రామీణ రేడియో గోష్ఠి: కోళ్ళపెంపకము లాభించాలంటే: ప్రసంగం
మార్కెట్టు ధరలు
వాతావరణ వివరాలు
7.00 తెలుగులో వార్తలు
7.15 తెలుగుబాట
7.30 రేడియో వార్తావాహిని (హైదరాబాద్‌నుండి రిలే)
7.45 చిత్రతరంగిణి: ఫిల్మ్ సంగీతం †
8.00 ఉభయకుశలోపరి. శ్రోతల ఉత్తరాలకు జవాబులు
8.15 March of science-Mechanical brains: talk by Dr. P. V. S. Rao
8.30 Radio News reel (relay from Delhi)
8.40 ప్రాదేశిక్ సుగమ సంగీత్ †
9.00 ఆంగ్లములో వార్తలు
9.15 ఢిల్లీనుండి రిలే
9.20 ఢిల్లీనుండి రిలే
9.30 సిరా స్వయంవరం: సంగీత నాటిక
10.30 ఆంగ్లములో వార్తలు
10.35 జనగణమన, ప్రసార సమాప్తి

## హైదరాబాద్-బి

మ॥ ప్రసారము I

283 మీ (1060 కిలోసై)

2.00* పద్మా రోఖలే
లక్ష్మీ శంకర్
జానకి అయ్యర్
2.10 ఉర్దూలో వార్తలు
2.20 కన్నడ పాటలు
2.30 స్త్రీల కార్యక్రమము (హిందీ)
3.00* ప్రసార సమాప్తి

రా॥ ప్రసారము II

8.00 మరాఠీ శ్రోతలకు
8.30 ప్రభా అత్రే ఖయాల్
9.15 ఉర్దూలో వార్తలు
9.30 ఉర్దూలో కార్యక్రమము
10.00* ప్రసార సమాప్తి

## హైదరాబాద్-సి

245.9 మీ (1220 కిలోసై)
వివిధభారతి (రిలే)
[వివరాలు 48-వ పేజీలో]

## విజయవాడ—బి

200 మీ (1500 కిలోసై)
వివిధభారతి (రిలే)
(వివరాలు 48-వ పేజీలో)


* సమయసూచన † గ్రామఫోన్ రికార్డ్ ‡ స్టూడియో రికార్డింగ్

## మంగళవారం మే 16

శక 1889 వైశాఖ 25

## మద్రాస్-ఎ

ప్రసారము I

416.7 మీ (720 కిలోసైకిల్సు)
ఉ॥ 6.00 నుండి 11.00 వరకు
మ॥ 11.55 నుండి 2.10 వరకు
సా॥ 5.30 నుండి రా॥ 12.00 వరకు
60.98 మీ (4920 కిలోసైకిల్సు)
ఉ॥ 6.30 నుండి 9.15 వరకు
41.90 మీ (7160 కిలోసైకిల్సు)
.. 10.25 నుండి సా॥ 5.10 వరకు
60.98 మీ 4920 కిలోసైకిల్సు)
సా॥ 6.40 నుండి రా॥ 11.00 వరకు

6.00 వందేమాతరం, మంగళగానం
6.05 తుదిప్పాడల్‌గళ్
6.30 నేటి కార్యక్రమ వివరణ, వాతావరణసూచన
6.35 అరుళ్ వాక్కు
6.40 బజారు ధరలు
6.45 సంగీతామృతం
రామ్నాడ్ కృష్ణన్
7.15 తమిళములో వార్తలు
7.30 అఖిలభారతరూపకకార్యక్రమం (తమిళం)
8.00 సి. ఎస్. సరోజిని
8.30 సంగీతమంజరి
8.45 గీతమంజరి
9.15 ఆర్. వి. వరలక్ష్మి. వీణ
9.45 ఎల్. కృష్ణన్
10.30 మధురగీతం
10.55 ఆంగ్లములో వార్తలు
11.00 ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

11.55 ప్రాంతీయసెయిదిగళ్
12.00* కార్మికుల కార్యక్రమము
12.30 వి. కె. శకుంతల
1.00 మూదర్ నిగళ్చ్చి ట్రీలకు
1.30 వాద్యగోష్ఠి
1.45 చిత్రగానం†
పాటం :
1.55 వాతావరణ సూచన
2.00 తమిళములో వార్తలు
2.10 ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము III

5.30* ఆర్. వి. వరలక్ష్మి : వీణ
6.00 విరామ సంగీతం
6.05 ప్రాంతీయ సెయిదిగళ్
6.15 చిత్రగానం†
యారుకు సొందం
అన్నై వా, ఆండవన్ కట్టళై
చిన్నంచిరు కిలగం
ఎంగవీట్టు పెణ్
గౌరీకల్యాణం, ఇదయ కమల
కొడిమలర్
6.45 నాటిక (తమిళం)
7.10 విరామ సంగీతం
7.15 తమిళములో వార్తలు
7.30 వ్యవసాయదారులకు (తిరుచ్చిమండి రిలే)
8.00 వి. కె. శకుంతల
8.30 పొల్లిసై :
వి. ఆర్. గజలక్ష్మి
ఎస్. మారియప్పన్
8.45 వాద్య సంగీతం
క్లారినెట్ : విజయ విద్యాంసుడు
9.00 ఆంగ్లములో వార్తలు
9.15 తంజావూరు కె. పి. శివానందం
సి. ఆర్. శారద: వీణ
తిరుచ్చి ఎస్. జి. సుందరం: మృదంగం
10.30 చిత్రగానం
ఇరువర్ ఉళ్ళం
ఇదయత్తిల్ నీ, కార్తిగై దీపం
ముదలాళి; నిశ్చయతాంబూలం
ఇదు సత్యం
కుళందయుం దైవముం
మహాకవి కాళిదాస్
11.00 సామాత్తై†
తిరువేంగాడు
పి. సుబ్రహ్మణ్య పిళ్లై : నాదస్వరం
11.30 రామ్‌నారాయణ్ : సారంగి
12.00 జనగణమన, ప్రసార సమాప్తి

## మద్రాస్-బి

ఉ॥ ప్రసారము I
211.3 మీ (1420 కిలోసైకిల్సు)

6.00 మద్రాస్ ఎ వలె
6.40 ఆంగ్లములో వార్తలు
6.45 మద్రాస్ ఎ వలె
7.00 తెలుగులో వార్తలు
7.15 సంగీతమంజరి
జి. ఎన్. బాలసుబ్రహ్మణ్యం
7.30 మద్రాస్ ఎ వలె
8.00 ఆంగ్లములో వార్తలు
8.15 ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II
211.3 మీ (1420 కిలోసైకిల్సు)

11.55 మద్రాస్ ఎ వలె
1.00 Music Potpourri†
1.30 ఆంగ్లములో వార్తలు
1.40 హిందీలో వార్తలు
1.50 తెలుగులో వార్తలు
2.00 ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము III

211.3 మీ (1420 కిలోసైకిల్సు)
(సా 5.30 నుండి 6.45 వరకు
60.98 మీటర్లపై గూడా)

5.30* Harry Pinto and Histrio†
6.00 ఆంగ్లములో వార్తలు
6.05 మద్రాస్ ఎ వలె
6.15 విరామ సంగీతం
6.20 వాతావరణ సూచన
స్థానిక ప్రకటనలు
వాణిజ్య వార్తలు
కార్యక్రమ వివరణ
6.45 మద్రాస్ ఎ వలె
7.00 తెలుగులో వార్తలు
7.15 మన సాహిత్యములో హాస్యము:
శ్రీనాథుడు : ప్రసంగం
జెలసూత్రం రుక్మిణీనాథశాస్త్రి
7.30 గీతమాలిక
8.00 మద్రాసు ఎ వలె
8.30 Radio News Reel (relay from Delhi)
8.40 విరామ సంగీతం
8.45 మద్రాస్ ఎ వలె
9.00 ఆంగ్లములో వార్తలు
9.15 ఢిల్లీనుండి రిలే
9.20 ఢిల్లీనుండి రిలే
9.30 Mazi Gaynor†
The John Coltrine Quartet†
10.30 ఆంగ్లములో వార్తలు
10.35 వాతావరణసూచన, జనగణమన, ప్రసార సమాప్తి

## మద్రాస్-సి

193.5 మీ (1550 కిలోసైకిల్సు)
వివిధభారతి (రిలే)
(వివరాలు 48-వ పేజీలో)

## బెంగుళూరు

ఉ॥ ప్రసారము I
491.8 మీ (610 కిలోసైకిల్సు)
భద్రావతి 375 మీ (800 కిలోసైకిల్సు)

6.30* వందేమాతరం, మంగళధ్వని
సుప్రభాత, విచారదీప్తి.
వాతావరణసూచన
6.40 ఆంగ్లములో వార్తలు
6.45 కార్యక్రమ వివరణ
6.50 గీతారాధన
7.10 సరోజినీ నాగరాజన్
7.40 బజారు ధరలు
7.45 కన్నడంలో వార్తలు
8.00 ఆంగ్లములో వార్తలు
8.15 సంస్కృత పాఠము
8.30 రాజమ్మ కేశవమూర్తి
8.40 బజారు ధరలు
8.50 ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II
(బెంగళూరు మాత్రమే)

12.30 వనితావిహార
1.00 సుధారావు
1.10 కన్నడములో వార్తలు
1.20 సుధారావు
1.30 ఆంగ్లములో వార్తలు
1.40 హిందీలో వార్తలు
1.50 సుధారావు
2.00 వాతావరణ సూచన, ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము III

5.30* కార్మికుల కార్యక్రమము
6.00 ఆంగ్లములో వార్తలు
6.05 స్థానిక ప్రకటనలు
వాతావరణసూచన (ఆంగ్లం)
6.10 వేణువు†
6.15 మనెయవరిగె
6.25 బృందగాన†
6.35 ప్రదేశ సమాచార
6.45 చిత్రగీతె †
7.00 గ్రామస్థులకు
7.45 కన్నడములో వార్తలు
8.00 ప్రసంగం (కన్నడం)
8.10 వాద్యశ్రీ†
8.15 తాళవాద్య
నిలయవిద్యాంసులు
8.30 ఢిల్లీనుండి రిలే
8.40 వాద్యశ్రీ†
8.45 నవసుమ: ఈ మాసపు పాట
ఆర్. ఇందిర
8.50 డి. కె. పట్టమ్మాళ్ †
9.00 ఆంగ్లములో వార్తలు
9.15 సమాచార దర్శన
9.25 వాద్య సంగీతం†
9.30 జి. వైదేహి
10.30 ఆంగ్లములో వార్తలు
10.35 వాతావరణ సూచన, జనగణమన. ప్రసార సమాప్తి

బుధవారం మే 17

శక 1889 వైశాఖ 27

## హైదరాబాద్-ఎ

405.4 మీ (740 కిలోసై)

89.42 మీ (3355 కిలోసై)
ఉ॥ 6-00 నుండి 7.45 వరకు
49.02 మీ (6120 కిలోసై)
ఉ॥ 8.00 నుండి 9.30 వరకు
42.02 మీ (7140 కిలోసై)
ఉ॥ 9.45 నుండి సా॥ 5.15 వరకు
62.50 మీ (4800 కిలోసై)
సా॥ 5.30 నుండి రా॥ 10.40

ఉ॥ ప్రసారము I

6.00* వందేమాతరం, మంగళధ్వని కార్యక్రమ వివరణ
6.10 భక్తిరంజని శ్రీరామునిపై త్యాగరాజకీర్తనలు
6.40 ఆంగ్లములో వార్తలు
6.45 సూక్తిముక్తావళి
6.50 వాద్యగోష్ఠి
7.00 తెలుగులో వార్తలు
7.15 ఎమ్. ఎల్. ప్రఫుల్ల
7.45 శాస్త్రీయ సంగీత †
8.00 ఆంగ్లములో వార్తలు
8.15 హిందీలో వార్తలు
8.30 వనజా అరావముదన్ వయొలిన్
9.40* వాతావరణ సూచన, ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

12.20* కార్మికుల కార్యక్రమము (విజయవాడనుండి రిలే)
1.00 మహిళా సమాజం స్త్రీల కార్యక్రమము
భక్తిగేయము
ప్రతి గృహంముందు తారల ముగ్గులు: ప్రసంగం సి. జయశ్రీ సారథి మాలామంతి
1.30 ఆంగ్లములో వార్తలు
1.40 చిత్రసీమ†
1.50 తెలుగులో వార్తలు
2.00 వాతావరణ సూచన, చిత్రసీమ†
2.30* ప్రసార సమాప్తి

ప్రసారము III

5.30* స్థానిక ప్రకటనలు
5.35 లలితసంగీతం: ఆకాశవాణి బృందం
5.50 పద్యపఠనము
6.00 ఆంగ్లములో వార్తలు
6.05 ప్రాంతీయ వార్తలు
6.15 ప్రాంతీయ వార్తలు (ఉర్దూ) (హైదరాబాద్, తెలంగాణ మాత్రమే)
6.25 ముఖ్యప్రకటనలు, విరామ సంగీతం
6.30 వ్యాపసాయిక విషయాలు
పశు సంవర్థక కేంద్రాలు: ప్రసంగం
చెఱకు చెట్లనుండి కంపోస్టు ఎరువు: సంభాషణ
ధరలు, వాతావరణము
7.00 తెలుగులో వార్తలు
7.15 వెలుగుబాట
7.30 భారతదర్పణం
7.35 చిత్రగమ†
7.45 కాలచక్రం: జరుగుతున్న సంఘటనలు ప్రసంగం బాసని సుదర్శన్‌రెడ్డి
7.55 విరామ సంగీతం
8.00 నాటిక (విజయవాడనుండి రిలే)
8.30 గానసుధ†
9.00 ఆంగ్లములో వార్తలు
9.15 ఢిల్లీనుండి రిలే
9.20 ఢిల్లీనుండి రిలే
9.30 Major Problems in Indian Poetics: The ideal reader: talk (relay from Delhi)
9.45 ఎమ్. ఎల్. ప్రఫుల్ల
10.30 ఆంగ్లములో వార్తలు
10.35 హిందీలో వార్తలు
10.40 వాతావరణ సూచన, జనగణమన, ప్రసార సమాప్తి

## కడప

333.3 మీ (900 కిలోసై)
సా॥ 5.30 నుండి రా॥ 10.40 వరకు
శనివారములు మాత్రము
సా॥ 5.30 నుండి రా॥ 11.10 వరకు

## విశాఖపట్నం

332.6 మీ (920 కిలోసై)
సా॥ 5.30 నుండి రా॥ 10.40 వరకు

## విజయవాడ

357.1 మీ (840 కిలోసై)

ఉ॥ ప్రసారము I

6.00* వందేమాతరం, శుభోదయం, ప్రసార విశేషాలు
6.10 భక్తిరంజని (హైదరాబాద్‌నుండి రిలే)
6.40 ఆంగ్లములో వార్తలు
6.45 సూక్తిముక్తావళి
6.50 బజారు ధరలు
6.55 విరామ సంగీతం
7.00 తెలుగులో వార్తలు
7.15 హైదరాబాద్ వలె
7.45 హిందీ పాఠము
8.00 ఆంగ్లములో వార్తలు
8.15 హిందీలో వార్తలు
8.30 హైదరాబాద్ వలె
9.00 ప్రసార సమాప్తి

మధ్యాహ్నం ప్రసారము II

12.30 కార్మికుల కార్యక్రమము
ఫిల్మ్ సంగీతం†
ఇంటికివచ్చిన చుట్టం: హాస్యరూపకం
విశేషాలు, కబుర్లు
1.00 మహిళా సమాజం (హైదరాబాద్‌నుండి రిలే)
1.30 ఆంగ్లములో వార్తలు

## హైదరాబాద్-బి

283 మీ (1060 కిలోసై)

మ॥ ప్రసారము I

2.00* చిత్తరంజని†
2.10 ఉర్దూలో వార్తలు
2.20 సుగం సంగీత
2.30 వనజా అరావముదన్, వయొలిన్
2.45 సుగం సంగీత
3.00* ప్రసార సమాప్తి

రా॥ ప్రసారము II

8.00* కన్నడ శ్రోతలకు
8.15 మరాఠీ శ్రోతలకు
8.30 డి. అర్. పార్వతీకర్
9.00 మజిల్
9.15 ఉర్దూలో వార్తలు
9.30 ఉర్దూలో కార్యక్రమము
10.00* ప్రసార సమాప్తి

## హైదరాబాద్-సి

245.9 మీ (1220 కిలోసై)
వివిధభారతి (రిలే
[వివరాలు 48-వ పేజీలో]

1.40 హిందీలో వార్తలు
1.50 తెలుగులో వార్తలు
2.00 వాతావరణ సూచన, ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము III

5.30* స్థానిక ప్రకటనలు
5.35 లలిత సంగీతం, పద్యపఠనం (హైదరాబాద్‌నుండి రిలే)
6.00 ఆంగ్లములో వార్తలు
6.05 ప్రాంతీయ వార్తలు
6.15 వాద్య బృందము
6.25 ముఖ్యప్రకటనలు, విరామ సంగీతం
6.30 పంట సీమలు
విస్తరణ కార్యకర్తలకు విజ్ఞప్తి
వేసవిలో పశువుల ఆరోగ్యం: ప్రసంగం
జానపదగేయము
రైతులకు గొర్రెలపెంపకం: ప్రసంగం
మార్కెట్టు ధరలు
వాతావరణ వివరాలు
7.00 తెలుగులో వార్తలు
7.15 హైదరాబాద్ వలె
7.30 మన నగరాల సమస్యలు: ప్రసంగం బి. రామయ్య
7.40 ఈ నెలపాట
7.45 లలితసంగీతం: వి. సరస్వతి
8.00 సంధ్య: నాటిక
మలయాళమాతృక: శంకర కురూప్
తెలుగుసేత: బి. వి. శ్రీనివాసాచార్యులు (మద్రాస్‌నుండి రిలే)
8.30 చిత్రతరంగిణి: ఫిల్మ్ సంగీతం †
9.00 ఆంగ్లములో వార్తలు
9.15 ఢిల్లీనుండి రిలే
9.20 ఢిల్లీనుండి రిలే
9.30 ఢిల్లీనుండి రిలే
9.45 అమృతవర్షిణి
10.30 ఆంగ్లములో వార్తలు
10.35 జనగణమన, ప్రసార సమాప్తి

## విజయవాడ-బి

200 మీ (1500 కిలోసై)
వివిధభారతి (రిలే)
[వివరాలు 48-వ పేజీలో]



* సమయ సూచన † గ్రామఫోన్ రికార్డ్ ‡ స్టూడియో రికార్డింగ్

బుధవారం మే 17

శక 1889 వైశాఖ 27

## మద్రాస్-ఎ

416.7 మీ (720 కిలోసై)
ఉ॥ 6-00 నుండి రా॥ 11-00 వరకు
మ॥ 11-55 నుండి 2-30 వరకు
సా॥ 5-30 నుండి రా॥ 12-00 వరకు
60.98 మీ (4920 కిలోసై)
ఉ॥ 6-30 నుండి 9-15 వరకు
41.90 మీ (7160 కిలోసై)
మ॥ 11-55 నుండి 2-30 వరకు
60.98 మీ (4920 కిలోసై)
సా॥ 6-40 నుండి రా॥ 11-00 వరకు

ఉ॥ ప్రసారము I

6-00* వందేమాతరం, మంగళగానం
6-05 తుదిప్పాడల్‌గళ్
6-30 నేటి కార్యక్రమ వివరణ, వాతావరణసూచన
6-35 అరుళ్ వాక్కు
6-40 బజారు ధరలు
6-45 విరామ సంగీతం
6-50 ఒలిమిగు భారతం
6-55 వాద్యగోష్ఠి
7-15 తమిళములో వార్తలు
7-30 పామాలై†
తురయూర్ రాజగోపాలశర్మ
8-15 ఎస్. నిర్మల
8-45 చిత్రగానం
9-15 వై. రాజగోపాలన్: వయొలిన్
9-45 వాద్యసంగీతం: వినాయకుగళం
10-00 ఎస్. నిర్మల
10-30 మధురగీతం
10-55 ఆంగ్లములో వార్తలు
11-00 ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

11-55 ప్రాంతీయ శెయిదిగళ్
12-00* కార్మికుల కార్యక్రమము
12-30 ఎమ్. ఎస్. వైద్యనాథన్
1-00 పెణ్ణులగం స్త్రీలకు
1-30 వాద్య గోష్ఠి
1-45 చిత్రగానం
వచ్చైవిళక్కు
1-55 వాతావరణసూచన
2-00 తమిళములో వార్తలు
2-10 ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము III

5-30* మెల్లిశై:
శ్రోతలు కోరిన పాటలు
సమర్పణ: ఆర్. నాగరాజన్
5-45 కట్టోట్టం: రూపకం (తమిళం)
6-00 విరామ సంగీతం
6-05 ప్రాంతీయ శెయిదిగళ్
6-15 చిత్రగానం†
నాన్ అనైయిట్టాల్, నీ
పార్తాల్ పసితీరుం, ముగరాశి
పొట్టై తెరియుదుపార్
పార్ మగళే పార్
మరక్క-ముడియుమా
6-45 ఎమ్ మురుగేశన్: వయొలిన్
7-15 తమిళములో వార్తలు
7-30 వ్యవసాయదారులకు (తిరుచ్చినుండి రిలే)
8-00 నాటిక (తమిళం)
8-15 Radio News Reel (relay from Delhi)
8-30 జ్ఞానం కృష్ణఅయ్యర్ కృతులు: సి. ఎస్. రాజలక్ష్మి
9-00 ఆంగ్లములో వార్తలు
9-15 ప్రసంగం (తమిళం)
9-30 శెందళిర్: కొత్తపాటలు
9-45 వాద్యసంగీతం
10-00 ఎమ్. ఎస్. వైద్యనాథన్
10-30 చిత్రగానం
మహాకవి కాళిదాస్
నమ్మవీట్టు లక్ష్మి
మేజర్ చంద్రకాంత్
కైకొడుత్త దైవం
మరక్క ముడియుమా
నిదిక్కుప్పిన్ పాశం
మనిదన్ మారవిల్లై
కావలిక్క నేరమిల్లై
11-30 సులోచనా పట్టాభిరామన్
టి. కేశవులు: వయొలిన్
వి. గురుమూర్తి: మృదంగం
12-00 జనగణమన, ప్రసార సమాప్తి

## మద్రాస్-బి

ఉ॥ ప్రసారము I

211.3 మీ (1420 కిలోసై)

6-00 మద్రాస్ ఎ రిలే
6-40 ఆంగ్లములో వార్తలు
6-45 మద్రాస్ ఎ రిలే
7-00 తెలుగులో వార్తలు
7-15 సంగీత మంజరి
ఎస్. గోపాలరత్నం
7-30 మద్రాస్ ఎ రిలే
8-00 ఆంగ్లములో వార్తలు
8-15 ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

211.3 మీ (1420 కిలోసై)

11-55 మద్రాస్ ఎ రిలే
1-00 Holiday in Portugal†
1-30 ఆంగ్లములో వార్తలు
1-40 హిందీలో వార్తలు
1-50 తెలుగులో వార్తలు
2-00 ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము III
211.3 మీ (1420 కిలోసై)
సా [5-30 నుండి 6-45 వరకు
60.98 మీటర్లపైగూడా]

5-30* Ray Charles†
6-00 ఆంగ్లములో వార్తలు
6-05 ప్రాంతీయ శెయిదిగళ్
6-15 విరామ సంగీతం
6-20 వాతావరణ సూచన,
స్థానిక ప్రకటనలు
వాణిజ్య వార్తలు
కార్యక్రమ వివరణ
6-45 మద్రాస్ ఎ రిలే
7-00 తెలుగులో వార్తలు
7-15 చిత్రగానం†
7-30 గీతమాలిక
8-00 సంధ్య: నాటిక
మలయాళమాతృక: శంకర కురుప్
తెలుగుసేత: బి. వి. శ్రీనివాసాచార్య
8-30 వాద్యగోష్ఠి
9-00 ఆంగ్లములో వార్తలు
9-15 ఢిల్లీనుండి రిలే
9-20 ఢిల్లీనుండి రిలే
9-30 National programme of talks
"Major problems in Indian Poetics:
The ideal reader: talk
(relay from Delhi)
9-45 మద్రాస్ ఎ రిలే
10-30 ఆంగ్లములో వార్తలు
10-35 వాతావరణ సూచన,
జనగణమన, ప్రసార సమాప్తి

## మద్రాస్-సి

193.5 మీ (1550 కిలోసై)
(వివిధభారతి (రిలే)
[వివరాలు చివర చూడండి]

## బెంగుళూరు

ఉ॥ ప్రసారము I
491.8 మీ (610 కిలోసై)
భద్రావతి: 375 మీ (800 కిలోసై)

6-30* వందేమాతరం, మంగళధ్వని
సుప్రభాత, విచారదీప్తి
వాతావరణసూచన
6-40 ఆంగ్లములో వార్తలు
6-45 కార్యక్రమ వివరణ
6-50 గీతారాధన
7-10 డి. బి. హరీంద్ర
7-40 బజారు ధరలు
7-45 కన్నడములో వార్తలు
8-00 ఆంగ్లములో వార్తలు
8-15 గానవిహార
8-30 ఎస్. వి. రాజేశ్వరి
ఎస్. వి. అనసూయ
8-40 బజారు ధరలు
8-50 ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము II
(బెంగుళూరు మాత్రమే)

12-30* వి. లలిత: వీణ
1-10 కన్నడములో వార్తలు
1-20 ఎస్. వి. రాజేశ్వరి
ఎస్. వి. అనసూయ
1-30 ఆంగ్లములో వార్తలు
1-40 హిందీలో వార్తలు
‡1-50 ఎస్. వి. రాజేశ్వరి
ఎస్. వి. అనసూయ
2-00* వాతావరణసూచన,
ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము III

5-30* కార్మికుల కార్యక్రమము
6-00 ఆంగ్లములో వార్తలు
6-05 స్థానిక ప్రకటనలు
వాతావరణసూచన (ఆంగ్లం)
6-10 సితార్†
6-15 సాహిత్య సాంస్కృతిక కార్యక్రమము (ఉర్దూ)
6-30 సుగమసంగీత†
6-35 ప్రదేశసమాచార
6-45 చిత్రగీతె†
7-00 గ్రామస్థులకు
7-45 కన్నడములో వార్తలు
8-00 ప్రసంగం (కన్నడం)
8-10 వాద్యశ్రీ†
‡8-15 గీతగుచ్ఛ
8-30 డి. బి. హరీంద్ర
9-00 ఆంగ్లములో వార్తలు
9-15 చిత్రగీతె†
9-30 ఢిల్లీనుండి రిలే
9-50 ఎమ్. జి. సులోచన
10-30 ఆంగ్లములో వార్తలు
10-35 వాతావరణ సూచన,
జనగణమన, ప్రసార సమాప్తి



* సమయ సూచన † గ్రామఫోన్ రికార్డ్ ‡ స్టూడియో రికార్డింగ్

## గురువారం మే 18

శక 1888 వైశాఖ 28

## హైదరాబాద్-ఎ

ఉ॥ ప్రసారము I

405.4 మీ (740 కిలోసై)

89.42 మీ (3355 కిలోసై)
ఉ॥ 6-00 నుండి 7-45 వరకు
49.02 మీ (6120 కిలోసై)
ఉ॥ 8-00 నుండి 9-30 వరకు
42.02 మీ (7140 కిలోసై)
ఉ॥ 9.45 నుండి సా 5-15 వరకు
62.50 మీ (4800 కిలోసై)
సా॥ 5-30 నుండి రా॥ 10-40 వరకు

6-00* వందేమాతరం, మంగళధ్వని కార్యక్రమ వివరణ
6-10 భక్తిరంజని (విజయవాడనుండి రిలే)
6-40 ఆంగ్లములో వార్తలు
6-45 సూక్తి ముక్తావళి (విజయవాడనుండి రిలే)
6-50 వాద్యగోష్ఠి: నిలయవిద్వాంసులు
7-00 తెలుగులో వార్తలు
7-15 విజయవాడ [illegible]
7-30 సంస్కృత పాఠము
7.45 సుగమ సంగీత్
8-00 ఆంగ్లములో వార్తలు
8-15 హిందీలో వార్తలు
8-30 విజయవాడ [illegible]
9-00* వాతావరణ సూచన, ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

12-30* కార్మికుల కార్యక్రమము
పాటలు†
చేదోడు, వాదోడు,
ఐకమత్యముపై రూపకం
మనలో మనమాట: ప్రవీణ్
రచన: ప్రవీణ్
1-00 ధర్మపురి రామమూర్తి
1-30 ఆంగ్లములో వార్తలు
1-40 చిత్రసీమ†
1-50 తెలుగులో వార్తలు
2-00 వాతావరణ సూచన, ధర్మపురి రామమూర్తి
2-30* ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము III

5-30* స్థానిక ప్రకటనలు
5-35 గ్రామలక్ష్మి (విజయవాడనుండి రిలే)
5-50 బాలవిహార్ (విజయవాడనుండి రిలే)
6-00 ఆంగ్లములో వార్తలు
6-05 ప్రాంతీయ వార్తలు
6-15 ప్రాంతీయ వార్తలు (ఉర్దూ)
6-25 ముఖ్య ప్రకటనలు, విరామ సంగీతం
6-30 వ్యవసాయిక విషయాలు
అటవీ శాఖ: సహకార సంస్థలు: ప్రసంగం
నూనెగింజల పంటలు,
మిశ్రమ సేద్యం: సంభాషణ
ధరలు, వాతావరణము
7-00 తెలుగులో వార్తలు
7-15 తెలుగుబాట
7-30 చతురంగం (విజయవాడనుండి రిలే)
7-45 రాగం, తానం, పల్లవి (విజయవాడనుండి రిలే)
8-30 Radio News Reel (relay from Delhi)
8-40 లలిత సంగీతం:
తత్వం: రామచంద్ర శర్మ
సీత, సత్యవతి. సత్యం
9-00 ఆంగ్లములో వార్తలు
9-15 ఢిల్లీనుండి రిలే
9-20 ఢిల్లీనుండి రిలే
9.30 Debate (relay from Delhi)
10-00 వాద్య సంగీతం†
10-30 ఆంగ్లములో వార్తలు
10-35 హిందీలో వార్తలు
10-40 వాతావరణ సూచన, జనగణమన, ప్రసార సమాప్తి

## కడప

333.3 మీ (900 కిలోసై)
సా॥ 5-30 నుండి రా॥ 10-40 వరకు
శనివారముల మాత్రము
సా॥ 5-30 నుండి రా॥ 11-10 వరకు

## విశాఖపట్నం

322.6 మీ (930 కిలోసై)
సా॥ 5-30 నుండి రా॥ 10-40 వరకు

## విజయవాడ

357.1 మీ (840 కిలోసై)

ఉ॥ ప్రసారము I

6-00* వందేమాతరం, మంగళధ్వని, ప్రసార విశేషాలు
6-10 భక్తిరంజని:
భక్త చింతామణి శతకం
అన్నపూర్ణ, అధ్యాత్మ రామాయణ కీర్తనలు
6-40 ఆంగ్లములో వార్తలు
6-45 సూక్తి ముక్తావళి
6-50 ఐజార్ ధరలు
6-55 విరామ సంగీతం
7-00 తెలుగులో వార్తలు
7-15 ఎ. వెంకటశేషయ్య: నాదస్వరం
7-30 సంస్కృత పాఠము (హైదరాబాద్‌నుండి రిలే)
7-45 సంగీత శిక్షణ: దేశభక్తిగేయం
8-00 ఆంగ్లములో వార్తలు
8-15 హిందీలో వార్తలు
8-30 శిష్టు ప్రభాకర కృష్ణమూర్తి శాస్త్రి
9-00 ప్రసార సమాప్తి

ప్రసారము II

12-30 కార్మికుల కార్యక్రమము (హైదరాబాద్‌నుండి రిలే)
1-00 ఎ. వెంకటశేషయ్య: నాదస్వరం

## హైదరాబాద్-బి

ప్రసారము I

283. మీ (1060 కిలోసై)
2-00* స్వరమండల్ వాదన్ నిలయ విద్వాంసుడు
2-10 ఉర్దూలో వార్తలు
2-20 మరాఠీ పాటలు
2-30 సుగద్ధ సంగీతం
2-50 లలిత సంగీతం (ఉర్దూ)
3-00* ప్రసార సమాప్తి

ప్రసారము II

8-00* ప్రసంగం (హిందీ)
8-15 చిత్రపథ్ సే†
8-45 నగరవాణి (నగరంలో ఈ వారము)
9-00 షేక్ దవూద్: తబ్లా
9-15 ఉర్దూలో వార్తలు
9-30 ఉర్దూ కార్యక్రమము
10-0* ప్రసార సమాప్తి

## హైదరాబాద్-సి

249.9 మీ (1200 కిలోసై)
(వివిధభారతి రిలే)
[వివరాలు 48-వ పేజీలో]

1-30 ఆంగ్లములో వార్తలు
1-40 హిందీలో వార్తలు
1-50 తెలుగులో వార్తలు
2-00 వాతావరణ సూచన, ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము III

5-30* స్థానిక ప్రకటనలు
5-35 గ్రామలక్ష్మి
శ్రీరామ భూపాలుడు: పాటలు
తీరిక వేళల్లో ఉపవృత్తులు:
బాలవిహార్ పతిశయం
సమర్పణ: పోతంకి బాలనంఘం
6-00 ఆంగ్లములో వార్తలు
6-05 ప్రాంతీయ వార్తలు
6-15 వాద్య బృందం
6-25 ముఖ్య ప్రకటనలు, విరామ సంగీతం
6-30 పంటపొలాలు
కృషి విజ్ఞానం
గ్రామీణ పరిశ్రమలు: పరిచయము
జానపద గేయం
తీరిక వేళల్లో స్త్రీలు పిల్లలు
ఆర్జించే మార్గాలు: ప్రసంగం
మార్కెట్టు ధరలు
వాతావరణ వివరాలు
7-00 తెలుగులో వార్తలు
7-15 తెలుగుబాట
7-30 చతురంగం
7-45 రాగం, తానం, పల్లవి.
రామవరపు సుబ్బారావు: విజ
డి. రామమోహన్‌రావు: మృదంగం
8-30 Radio News Reel (relay from Delhi
8-40 చిత్రతరంగిణి-
ఫిల్మ్ సంగీతం†
9-00 ఆంగ్లములో వార్తలు
9-15 ఢిల్లీనుండి రిలే
9-20 ఢిల్లీనుండి రిలే
9-30 Debate (relay from Delhi
10-00 శిష్టు ప్రభాకర కృష్ణమూర్తి శా
10-30 ఆంగ్లములో వార్తలు
10-35 జనగణమన, ప్రసార సమా

## విజయవాడ-బి

200 మీ (1500 కిలోసై)
వివిధభారతి (రిలే)
[వివరాలు 48-వ పేజీలో]



* సమయసూచన † గ్రామఫోన్ రికార్డ్ ‡ స్టూడియో రికార్డింగ్

మంగళవారం మే 31

శక 1859 జ్యేష్ఠ 9

## మద్రాస్-ఎ

4.16 మీ (720 కిలోసైకిల్స్)
ఉ॥ 6.00 నుండి 11.00 వరకు
మ॥ 11.55 నుండి 2.30 వరకు
సా॥ 5.30 నుండి రా॥ 12.00 వరకు
60.98 మీ (4920 కిలోసైకిల్స్)
ఉ॥ 6.30 నుండి 9.15 వరకు
41.90 మీ (7160 కిలోసైకిల్స్)
మ॥ 11.55 నుండి 2.10 వరకు
60.98 మీ (4920 కిలోసైకిల్స్)
సా॥ 6.40 నుండి రా॥ 11.00 వరకు

ఉ॥ ప్రసారము I

6.00 వందేమాతరం. మంగళగానం
6.03 తుదిప్పాడల్‌గళ్
6.30 నేటి కార్యక్రమ వివరణ, వాతావరణ సూచన
6.35 అరుళ్ వాక్కు
6.40 బజారు ధరలు
6.45 సంగీతామృతం: మధురై సోమసుందరం
7.15 తమిళములో వార్తలు
7.30 అఖిలభారత నాటక కార్యక్రమం (తమిళం)
8.30 సంగీత మంజరి
8.5 గీతమంజరి
9.15 బి. ఎస్. రామస్వామి: వీణ
9.45 ముడికొండాన్ ఆర్. వి. రాజేశ్వరి: వీణ
10.30 మధుకరత
10.55 అంగ్లములో వార్తలు
11.00* ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

11.55 ప్రాంతీయ శెయిదిగళ్
12.00* కార్మికుల కార్యక్రమము
12.30 మధురై పి. సేతురామన్
1.00 మాదర్ నిగప్పి స్త్రీలకు
1.30 వాద్యగోష్ఠి
1.45 చిత్రగానం† తత్తిలితం
1.55 వాతావరణ సూచన
2.00 తమిళములో వార్తలు
2.10 ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము III

5.50 బి. ఎస్. రామస్వామి: వీణ
6.0 కీర్తన సంకీర్తనం
6.55 ప్రాంతీయ శెయిదిగళ్
6.15 చిత్రగానం†
మహాకవి కాళిదాస్
మనం ఒరు కురంగు
నెంజిరుక్కుంవరై
పాలుం కళమమం, నిర్కుమిళి
పార్తాల్ పసితిరుం, సెల్వం
పూంపుహార్
6.45 నాటిక (తమిళం)
7.5 తమిళములో వార్తలు
7.30 వ్యవసాయదారులకు (తిరుచ్చినుండి రిలే)
8.10 సంగీత రూపకం (తమిళం)
9.00 అంగ్లములో వార్తలు
9.15 తిరువిళిమళలై సోదరులు: నాదస్వరం
వలయపట్టి ఎ. ఆర్. సుబ్రహ్మణ్యం, డోలు
10.30 చిత్రగానం†
మద్రాస్ టు పాండిచ్చేరి
నాన్ అనైయిట్టాల్, పాశమలర్
పుదియపరవై, శెకాన్ తంబి
తిరువెళయాడల్
సరస్వతి శపథం
ఉల్లాస పయణం
11.00 పామాలై
చెంబై వైద్యనాథ భాగవతర్
11.30 నియాజ్ అహమ్మద్‌ఖాన్
ఫయాజ్ అహమ్మద్ ఖాన్
12.00 జనగణమన, ప్రసార సమాప్తి

## మద్రాస్-బి

ఉ॥ ప్రసారము I

211.3 మీ (1420 కిలోసైకిల్స్)
6.00 మద్రాస్ ఎ వలె
6.40 అంగ్లములో వార్తలు
6.45 మద్రాస్ ఎ వలె
7.00 తెలుగులో వార్తలు
7.15 సంగీత మంజరి
ఎమ్. ఎల్. వసంతకుమారి
7.30 మద్రాస్ ఎ వలె
8.00 అంగ్లములో వార్తలు
8.15 ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

211.3 మీ (1420 కిలోసైకిల్స్)
11.55 మద్రాసు ఎ వలె
1.00 Carmen†
1.30 అంగ్లములో వార్తలు
1.40 హిందీలో వార్తలు
3.50 తెలుగులో వార్తలు
2.00 ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము III

211.3 మీ (1420 కిలోసైకిల్స్,
(సా 5.30 నుండి 6.45 వరకు
60.98 మీటర్లపై కూడా)
5.30 Wind Quintet of South West German Radio
6.00 అంగ్లములో వార్తలు
6.05 మద్రాస్ ఎ వలె
6.15 విరామ సంగీతం
6.20 వాతావరణ సూచన
స్థానిక ప్రకటనలు
వాణిజ్య వార్తలు
కార్యక్రమ వివరణ
6.45 వాద్య సంగీతం
7.00 తెలుగులో వార్తలు
7.15 స్వీయకవిత: పద్యపఠనము
పి. గణపతి శాస్త్రి
7.0 గీతమాలిక
8.00 మధురై టి. సేతురామన్
8.30 Radio News Reel (relay from Delhi)
8.0 విరామ సంగీతం
8.45 వాద్య సంగీతం: క్లారినెట్
9.00 అంగ్లంలో వార్తలు
9.15 ఢిల్లీనుండి రిలే
9.20 ఢిల్లీనుండి రిలే
9.30 Eddie Gorme Jackie Gleason
10.30 అంగ్లములో వార్తలు
10.35 వాతావరణ సూచన, జనగణమన, ప్రసార సమాప్తి

## మద్రాసు-సి

193.5 మీ (1550 కిలోసైకిల్స్)
వివిధభారతి (రిలే)
(వివరాలు 45-వ పేజీలో

## బెంగుళూరు

ఉ॥ ప్రసారము I

491.8 మీ (610 కిలోసైకిల్స్)
భద్రావతి: 378 మీ (808 కిలోసైకిల్స్)
6.30* వందేమాతరం, మంగళధ్వని
సుప్రభాత, విచారదీప్తి,
వాతావరణ సూచన
6.40 అంగ్లములో వార్తలు
6.5 కార్యక్రమ వివరణ
6.50 గీతారాధన
7.10 టి. శారదా: వీణ
7.40 బజారు ధరలు
7.45 కన్నడంలో వార్తలు
8.00 అంగ్లములో వార్తలు
8.15 నంన్నవ పాఠకులు
8.30 వై. ఎస్. ఇందిర
8.40 బజారు ధరలు
8.50 ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము II

(బెంగుళూరు మాత్రమే)
12.30 వనితావిహార
1.00 జి.వి. తంగనాయకమ్మ, జి.వి.నీల
1.10 కన్నడములో వార్తలు
1.20 జి.వి తంగనాయకమ్మ, జి.వి.నీల
1.30 అంగ్లములో వార్తలు
1.40 హిందీలో వార్తలు
1.50 జి.వి. తంగనాయకమ్మ, జి.వి.నీల
2.00 వాతావరణ సూచన.
ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము III

5.30* కార్మికుల కార్యక్రమము
6.00 అంగ్లములో వార్తలు
6.05 స్థానిక ప్రకటనలు
వాతావరణ సూచన (అంగ్లం)
6.10 సితార్
6.15 మనెయమట్టు
6.25 వృందగానం†
6.5 ప్రదేశ సమాచార
6.5 చిత్రగీతె†
7.00 గ్రామస్థులకు
7.45 కన్నడములో వార్తలు
8.00 ఆటల సమీక్ష (కన్నడం)
8.10 వాద్య శ్రీ†
8.15 తాళవాద్య: నిలయవిద్వాంసులు
8.30 ఢిల్లీనుండి రిలే
8.40 వాద్యశ్రీ†
8.45 సంగీతం: ఈ మాసపు పాట
ఆర్. ఇందిర
8.50 టి.ఆర్. మహాలింగం: వేణువు
9.00 అంగ్లములో వార్తలు
9.15 సమాచార దర్శన
9.5 వాద్య సంగీతం†
9.30 అంబుజన్నన్
తిరుకా సంపత్
10.30 అంగ్లములో వార్తలు
10.35 వాతావరణ సూచన, జనగణమన, ప్రసార సమాప్తి

* సమయసూచన † గ్రామఫోన్ రికార్డ్ ‡ స్టూడియో రికార్డింగ్

## బుధవారం మే 31

శక 1889 జ్యేష్ఠ 10

## హైదరాబాద్-ఎ

89.42 మీ (3355 కిలోసైకిల్స్)
ఉ॥ 6.00 నుండి 7.45 వరకు
49.02 మీ (6120 కిలోసైకిల్స్)
ఉ॥ 8.00 నుండి 9.30 వరకు
42.02 మీ (7140 కిలోసైకిల్స్)
ఉ॥ 9.45 నుండి సా॥ 5.15 వరకు
62.50 మీ (4800 కిలోసైకిల్స్)
సా॥ 5.30 నుండి 10.40 వరకు
405.4 మీ (740 కిలోసైకిల్స్)

ఉ॥ ప్రసారము I

6.00* వందేమాతరం, మంగళధ్వని కార్యక్రమ వివరాలు
6.10 భక్తిరంజని
6.40 ఆంగ్లములో వార్తలు
6.45 సూక్తిముక్తావళి
6.50 వాద్య గోష్ఠి
7.00 తెలుగులో వార్తలు
7.15 నేటి శ్రీరామకథ
7.45 సుగమ సంగీత్
8.00 ఆంగ్లములో వార్తలు
8.15 హిందీలో వార్తలు
8.30 జమాల్ద్దీన్ బార్టియా
9.00* వాతావరణ సూచన, ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

12.30* కార్మికుల కార్యక్రమము (విజయవాడనుండి రిలే)
1.00 మహిళా సమాజం
స్త్రీల కార్యక్రమము
శ్రోతలు కోరిన పాట
పెద్దల మాటపై నేటి యువతీ యువకులు లేరు కారణం?
చర్చ
పాల్గొనువారు:
ప్రమదా మండలి,
శ్రీ మండలి సభ్యురాండ్లు
1.30 ఆంగ్లములో వార్తలు
1.40 చిత్రసీమ†
1.50 తెలుగులో వార్తలు
2.00 వాతావరణ సూచన, చిత్రసీమ†
2.30* ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము III

5.30* స్థానిక ప్రకటనలు
5.35 అతిత సంగీతం:
కె. వి. వి. మోహన్‌రాజు
5.50 పద్యపఠనం
6.00 ఆంగ్లములో వార్తలు
6.05 ప్రాంతీయ వార్తలు
6.15 ప్రాంతీయ వార్తలు (ఉర్దూ)
[హైదరాబాద్, కడపలు మాత్రమే]
6.25 ఉత్పత్తి ప్రకటనలు, విరామ సంగీతం
6.30 వ్యవసాయక విషయాలు
పశువుల మేత, సమగ్ర ఆహారము — అధిక పాల ఉత్పత్తి; ప్రసంగం
జానపద గేయము
పసుపు పంట — తెగుళ్ళు — నివారణ: సంభాషణ
ధరలు, వాతావరణము
7.00 తెలుగులో వార్తలు
7.15 వెలుగుబాట
7.30 భారత దర్పణం
7.35 చిత్రసీమ†
7.45 కాలచక్రం-జరుగుతున్న సంఘటనలు
ఎన్. రఘుపతిరావు
7.55 విరామ సంగీతం
8.00 నాటిక
(మద్రాస్‌నుండి రిలే)
8.30 గీత శంకరం నుండి అష్టపదులు
9.00 ఆంగ్లములో వార్తలు
9.15 ఢిల్లీనుండి రిలే
9.20 ఢిల్లీనుండి రిలే
9.30 National programme of talk
9.45 నేటి శ్రీరామకథ
10.30 ఆంగ్లములో వార్తలు
10.35 హిందీలో వార్తలు
10.40 వాతావరణ సూచన, జనగణమన, ప్రసార సమాప్తి

## కడప

333.3 మీ (900 కిలోసైకిల్స్)
సా॥ 5.30 నుండి రా॥ 11.10 వరకు
శనివారములు మాత్రము
సా॥ 5.30 నుండి రా॥ 11.10 వరకు

## విశాఖపట్నం

322.6 మీ (930 కిలోసైకిల్స్)
సా॥ 5.30 నుండి రా॥ 11.10 వరకు

## విజయవాడ

357.1 మీ (840 కిలోసైకిల్స్)

ఉ॥ ప్రసారము I

6.00* వందేమాతరం, శుభోదయం, ప్రసార విశేషాలు
6.10 భక్తిరంజని
(హైదరాబాద్‌నుండి రిలే)
6.40 ఆంగ్లములో వార్తలు
6.45 సూక్తిముక్తావళి
6.50 బాలానంద ధ్వనులు
6.55 విరామ సంగీతం
7.00 తెలుగులో వార్తలు
7.15 హైదరాబాద్ వలె
7.45 హిందీ పాఠము
8.00 ఆంగ్లములో వార్తలు
8.15 హిందీలో వార్తలు
8.30 హైదరాబాద్ వలె
9.00 ప్రసార సమాప్తి

## హైదరాబాద్-బి

283 మీ (1060 కిలోసైకిల్స్)

ప్రసారము I

2.00* చిత్రరథ్ సే†
2.10 ఉర్దూలో వార్తలు
2.20 సుగమ సంగీత్
2.30 వివిధ రాగ్†
2.50 సుగమ సంగీత్
3.00* ప్రసార సమాప్తి

ప్రసారము II

8.00 కన్నడ కార్యక్రమము
8.15 మరాటీ శ్రోతలకు
8.30 మధుసూదన్ భావే: ఖయాల్
9.00* ఖావల్†
9.15 ఉర్దూలో వార్తలు
9.30 ఉర్దూలో కార్యక్రమము
10.00* జనగణమన, ప్రసార సమాప్తి

## హైదరాబాద్-సి

245.9 మీ (1220 కిలోసైకిల్స్)
వివిధభారతి (రిలే)
[వివరాలు 48-వ పేజీలో]

మ॥ ప్రసారము II

12.30* కార్మికుల కార్యక్రమము
ఫిల్మ్ సంగీతం†
స్వయంకృషి: నాటిక
రచన: ఎస్. వెంకటేశ్వరరావు
విశేషాలు
1.00 మహిళా సమాజం
(హైదరాబాద్‌నుండి రిలే)
1.30 ఆంగ్లములో వార్తలు
1.40 హిందీలో వార్తలు
1.50 తెలుగులో వార్తలు
2.00 వాతావరణ సూచన.
ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము III

5.30* స్థానిక ప్రకటనలు
5.35 అతిత సంగీతం, పద్యపఠనం
(హైదరాబాద్‌నుండి రిలే)
6.00 ఆంగ్లములో వార్తలు
6.05 ప్రాంతీయ వార్తలు
6.15 వాద్య ఖండం
6.25 ముఖ్య ప్రకటనలు
విరామ సంగీతం
6.30 పంటసీమలు
జనతాలయాలు
జల విద్యుత్ పరికరాలు: రూపకం
రచన: ప్రయాగ
మార్కెట్టు ధరలు
వాతావరణ వివరాలు
7.00 తెలుగులో వార్తలు
7.15 హైదరాబాద్ వలె
7.30 ఆంధ్ర రాష్ట్రములో ప్రాచీన నగరాలు—అమరావతి
ప్రసంగం
7.45 ఈ నెలపాట
7.45 లలితసంగీతం†
వింజమూరి లక్ష్మి
8.00 నాటిక
(మద్రాస్‌నుండి రిలే)
8.30 చిత్ర తరంగిణి.
ఫిల్మ్ సంగీతం†
9.00 ఆంగ్లములో వార్తలు
9.15 ఢిల్లీనుండి రిలే
9.20 ఢిల్లీనుండి రిలే
9.30 ఢిల్లీ నుండి రిలే
9.45 అమృత వర్షిణి
10.30 ఆంగ్లములో వార్తలు
10.35 జనగణమన, ప్రసార సమాప్తి

## విజయవాడ—బి

200 మీ (1500 కిలోసైకిల్స్)
వివిధభారతి (రిలే)
[వివరాలు 48-వ పేజీలో]



* వాతావరణ సూచన † గ్రామఫోన్ రికార్డు ‡ స్టూడియో రికార్డింగ్

సంగీతరూపకం

# పవ్వళింపు సేవ

## [శ్రీ త్యాగరాజస్వామి ప్రత్యేకానుభూతి]

రచన: కల్లూరి వీరభద్రశాస్త్రి

నానా చిత్ర విచిత్ర నిర్మాణం కలయీ అనంత విశ్వం చిన్మయము. శాశ్వతమునైన పరమాత్మ ప్రతిబింబము. యీ అనంత విశ్వంలోని తృణాంకురం మొదలు తరుల తావి కుంజాలూ, పర్వత నదీసముద్రాలూ, వరపాలంకారాలూ, సకల విద్యలూ కళలూ, ఆ విశ్వరూపుని కటాక్ష స్పందనాలే.

కావున వేదాలు, ఋషులు రాజయోగులు, నాదయోగులు, ఉపాసకులు, భక్తులు ముగ్ధమోహన హృదయములుగల శిశువులు, పశువులు, నైజంగా క్రూరములైన జంతువులు సైతం సహజ సుందరమైన ప్రకృతి శోభను దైవలక్ష్యంతో మేళవించినప్పుడు తన్మయత్వాన్ని పొందితీరుతాయి. ఇట్లే మన ప్రాచీన సంస్కృతి అర్థమయింది.

ఈ ప్రకృతి పరమాత్మల మేళనం హృదయవీణా తంత్రీవినాదంతో ఆపాత మధురమైన నాద శరీరంతో చేరి సాక్షాత్కరిస్తే బ్రహ్మానందం. ఆ క్షణంలోనే అనుభవ రూపం పొందుతుంది. ఈ మధురానుభూతిని తన దైనందిన నిత్యజీవితంలో నిరంతరం భావిస్తూ, శ్రీ తారక బ్రహ్మముతో సర్వతోముఖ సమన్వయాన్ని సామరస్యాన్ని కల్గించుకొని, నాదబ్రహ్మము భవంతో చక్కని జాను తెనుగు నుడికారపు సొంపుతో రామచంద్రమూర్తిని కీర్తించు మహోపాసకుడు నాదయోగి శ్రీ త్యాగరాజస్వామి శ్రీరామ భక్తియే మహోన్నత సామ్రాజ్యమని పొంగిపోయినవాడు యీ మహనీయుడు. నిత్యం వేకువజాము మొదలు తంబుర ధరించి సీతా శ్రీరాములను నిత్య నూతనములైన నామకుసుమాలతో, అర్చిస్తూ ఆడి పాడి ఆనందిస్తాడు. వీరి జీవన విధానంలో రామకీర్తనం చేస్తూ జరిపే ఉంఛవృత్తి యాత్రలను ప్రజలు తిరునాళ్ళవలె దర్శించి ఆనందించేరు. ఇలా నిత్యోపచారములలో రాత్రిళ్ల పవళింపుసేవ చెయ్యటం ఆచారం. ప్రపంచంలోని జీవులందరికీ రాత్రి కాలం విశ్రాంతినిస్తుంది. యోగి అనుభవం కూడా అంతే. శ్రీ త్యాగరాజస్వామి శ్రీ సీతారాములతో ఒక యేకాంత సంవిధానాన్ని కల్పించుకొని తన సంగీతాన్ని వినమని, తన సేవా భాగ్యం చేసుకొనమని, శ్రీ సీతారాములను కోరుకుంటాడు] వినండి యీ మహనీయుని అద్భుత భావుకత్వం.

బంగారు మేటిపాన్పుపై భామామణి
జానకి
శృంగారించుకొని చెలువొంద
విన్నగని
పొంగుచు మల్లెవిరుల పూజించువేళ
శ్రీ హరి
సంగీతము పాడమని స్వామి
త్యాగరాజుతో॥
(ధన్యాసి ఆది)
రామాభి. మా మనసు రంజిల్ల
బిర్రగ రాదా॥

అంతలో వారి దివ్యదర్శనానుభవం చిత్తంలో తళుక్కుమని మెరిసింది. తాను వారికేమి ఉపచారాలు చెయ్యవలెనో అని సంభ్రమంతో సంకల్పం రేకెత్తింది. లక్ష్యశుద్ధి, అంతఃకరణ శుద్ధి, ఆ జన్మసిద్ధములైన యీ మహనీయ భావుకునికి సిద్ధించినందున స్థిమితపడి ఆ దివ్యమూర్తులకు షోడశోపచార పూజలు చేస్తాడు. యీ పూజయే కల్పంలోనూ లేదు. యీ పూజా విధి నైజత్యాగరాజ కృతం అంటాడు. ఎవరికి కల్గుతుందీ ధైర్యం ఆ విశ్వమూర్తికి తన శరీరమే దేవాలయమంటాడు

తనువేదికనువైన సదనమౌను
రఘునాథా
స్థిరచిత్తమువర చామీకరపీఠము
రఘునాథా
నువదధ్యానము సురగంగాజలమౌ
రఘునాథా
ఇభపోక అభిమానము శుభచేలము
రఘునాథా
ఘనకీర్తి విబల్కే వాసనగంధము
రఘునాథా
హరినామస్మరణంబులు విరులౌరా
రఘునాథా
తొలిదుష్కృత ఫలమెల్ల గుగ్గులు
ధూపము రఘునాథా
నీ పాద భక్తే ప్రొద్దును దీపాధార
రఘునాథా
నేచేయుసుపూజఫలము భోజనమౌ
రఘునాథా
వినుజూచుటె ఘనదీపారాధనమౌరా
రఘునాథా
ఎడబాయని నా యెడగల సుఖము
విడెము రఘునాథా
పూజావిధి నైజత్యాగ రాజకృతము
రఘునాథా
పరిపాలయ పరిపాలయ, పరిపాలయ,
రఘునాథా॥
(రీతిగౌళ రూపకం)

యీ పూజలో స్థిరచిత్తం ఆసనమనీ, నా జన్మాంతర పాపాలన్నీ కాలు ధూపం వెయ్యడంవల్ల వాటికి సువాసనే వచ్చిందనీ, నీతో అంటిన సుఖానుభవమే విడెము—అంటే తాంబూల రక్తిమ అనీ హృదయాన్ని కదిలించే ఆరాధన చేసినాడా మహనీయుడు. పవళింపు సేవలో ఆగమశాస్త్ర సంప్రదాయం ప్రకారం శొంఠి, చక్కెర, సుగంధ ద్రవ్యాలు కలిపిన క్షీరాలను, ఇంకా మరికొన్ని పక్వాన్నాలను స్వామికి ఆరగింపు చెయ్యడం ఆచారం. అందులోనూ దక్షిణ భారతంలో యీ అందచందాలు చాలా అపూర్వములైనవి. యీ సందర్భంలో మహనీయుడు అచ్చమైన ప్రాచీన మర్యాదను నిరూపిస్తూ స్త్రీ కరాగ్రపచితం అనీ భోజ్యేషుమాతా అనీ గృహలక్ష్మిని గౌరవించిన రీతిలో శ్రోత్రియంగా ఆ మహారాజ్ఞి సీతమ్మచేతనే వడ్డన చేయించడం ఎంతో అపురూపంగావుంది

ఆరగింపవే పాలారగింపవే॥
రఘువీర జనకజాకర పవిత్రమౌ
వెన్నపా॥ లారగింపవే
సారమైన దివ్యాన్నము షడ్రసయుత
భక్షణములు
దార సోదరాదులతో త్యాగరాజ
వినుతపా॥ లారగింపవే
(తోడి రూపకం)

ఆరగింపు అయిన వెంటనే ముఖవాసం గంధమాల్యాలు సమర్పించి కొంతసేపు గోష్ఠి అయిన తర్వాత శ్రీ త్యాగయోగి కొంచెంసేపు సంగీతం వినిపించేదేమోనని తోస్తుంది. అంతలో శ్రీ రామ ప్రభువుకు విశ్రాంతి కైంకర్యం జరుపవలెనని తన నిర్మల హృదయ సౌధాంతరాళంలో పూల పాన్పు సంతరించుకొని "స్వామీ! ఇందు శయనించండి" అని కోరుతాడు.

పూలపాన్పుమీద బాగపూర్ణ పవ్వళించు
నీలఘనశ్యామ హరే నిరుపమ
రామయ్యమల్లె॥
మదురశర్కర యూన బాలు మరి
యారగించి
విదుముఖ కమ్మని విడెమువేసి
నను కటాక్షించి॥
పరిమళగంధంబుమేన బాగుగాను బూసి
మెరయగ సుమహారములను
మెడనిండను వేసి॥
ఆగమోక్తమైన శయ్యనంగీకరించి
త్యాగరాజ కృతములెల్ల తథ్యమని
సంతోషించి॥
(ఆహిరి త్రిపుట)

ఇట్లు పవ్వళించిన ఆ పు సాం మోహనమూర్తిని దర్శిస్తూ ఒక్క మాటలో శ్రీ స్వామితో సరసోక్తి మాట్లాడుకొని తానుశృంగారనాయికగా భావిస్తాడు. చమత్కరిస్తూ తన పరిసరాలూ, కావేరీతీరం పవిత్ర పంచనద క్షేత్రం తనతోడి వేదాధ్యయనంచేసిన చతుర్వేదవేత్తలు. చివరికి ఆ పరిసరాల్లోవున్న శుకపికచారికలూ పుణ్యసతీమతల్లులు, అందరినీ తను స్మరించి

శ్రీరామసేవలో వారిని దరిసి సంత
రించుకొని సర్వజనులకూ భాగ
స్వామ్యం కల్పించాలని ఆ రమణీయ
సుందర దృశ్యాన్ని చిత్రిస్తూ సొగ
సుగా హాస్యం చేస్తూ "ఇన్ని అంద
చందాలు నీకు నేను సమకూరిస్తే
రామా! నీకు మురిపెం పెరిగిందా"
మురిపెం అంటే సౌందర్య గర్వం.
యానహజప్రకృతిశోభనీ అయోధ్యలో
లేక వైకుంఠంలో మాత్రం వున్నదా?
అని ముచ్చటగా మురిపిస్తాడు.

మురిపెము పెరిగెగదా రామ
నన్ను నిను శరిషరడ శ్రీరామ॥
పరమపురుష జగదీశ వరమృదు,
భాష సుగుణమణికోశ నీకు
ఈడు లేని మలయమారుతముచేర,
గూడిన కావేరీతటమందు
మేడలమిద్దెలతో శృంగారము మించు
సదనములలో
వేడుచు భూసురులగ్నిహోత్రులై
వేదఘోషములచే నుతి సేయగ
జూచి శివుడుగోరు యోగ్యమైన,
సుందరమగు పురము దొరకెనందు॥
సకల సుగంధ రాజకుసుమములు
సౌరభితమగు కోకిల నాదమ్ములు
శుభముఖ న కాదంబనుతమైన,
సుందరపులుగలిగి
… వాణి … సుందరవతి,
… మణి భక్తిర నేడు
ప్రకటమైన నవరత్న … హా,
టకమంటప … ముగ గునముచు
ఈ మహిలో సొగసైన నచోళ,
సీమయందు వరమైన పంచనదపుర
నామునిచెంతను వసించుటకై,
నీమది నెంచగ
… త్యాగరాజ సన్నుత,
… సకలనయ విధృతచరణ
క్షేమముగ వర్ధిల్లునట్టి పురమున
శుభసౌమిత్రి ప్రక్కగొలిచె రవి॥
(ముఖారి-ఆది)

ఇంతటి జాతీయభావం ఎంతో గొప్పగా వుండి … వెంటనే ఆ సొమ్ము ఉయ్యాల రూపలోనే వుండడం స్వభావం. దీన్నే ఉంజల్ ఉత్సవం అంటారు. ప్రాచీనులైన వాగ్గేయకారులు ఈ ఉయ్యాల గొలుసులు శబ్దాల వేదాలనీ తొట్టె బ్రహ్మాండం గోళ పట్టి ఏమేమో అందంచేసి ఆత్మానుభవాన్ని పొందినారు అదే వరవడిలో మన అయ్యగారు హృదయం పొంగునట్లు ఈతని స్వతంత్ర వ్యక్తిత్వంతో శరీరమును అంతరంగమును మరచి ఆత్మానందంలో పొంగిపుడు "నా భాగ్యమా రామ!" అని పిలిచి దేవలోక సౌభాగ్యాన్ని ప్రసాదిస్తూ చల్లని నీడాంబరిలో ఉయ్యాల లూపుతాడు స్వామిని.

ఉయ్యాల లూగవయ్యా శ్రీ … ॥
నయ్యాలపాటలను సార్వభౌమ
కమలజాఖిల సురలు వినుగొవ్వ.
విమలులైన మునీంద్రులు ధ్యానింప
కమనీయ భాగవతులు గుణకీర్తనముసు
నాలాపంబులు సేయగ॥
నారదాదులు మెచ్చియును నుతియింప
సారముల బాగవి … వినుమమ్ము
వారల సద్భాగోచుదు వేడ్క సభలను
జూచుచు శ్రీరామ
నవమోహనాంగులైన సురసతులు
వివరముగ జూడగ నాభాగ్యమా
నవరత్న మంటపమున త్యాగరాజ
వినుతాకృతి బూనిన శ్రీరామ॥

ఇందు భావుకులచిత్తాలు ఉర్రూతలూగిస్తున్నట్లున్నాయి. అంతలో శ్రీరాములు అర్ధ మీలిత నేత్రాలు అరగా సగంమూసిన కనులతోవుండగా ఆ అర్ధాంత ఉపాల నేత్రాల అందచందాల సౌభాగ్యం అనుభవిస్తూ లాలి పాటలు పాడతారు. లాలి, జోజో శబ్దాలు ధ్వనిప్రధానములై యుంటాయి, ఆ అర్ధనిమీలిత నిద్రావస్థలో లాలి శబ్దములైన ఇంపైన పదాలు విన్న, ఎంతో చక్కని రాగభావంతో లాలి పాటలు రక్తిగాత్రాలతో పాడాలి. అక్కడ అర్ధచర్చ పనికిరాదు.

రామరామ రామలాలి శ్రీరామ
రామ మ లావణ్యలాలి
దొరకరాని నిధి నా … దొరకు
దొరవునీవు తొట్లలోరారా॥
వరమైనట్టి నావట్టిరారా. వరసుఖలకు
అరుదైన సుందర … ।
తొలి జేసిననోముఫలము …
ఇలను వెలయు ఇనవంశధనమా।
కలకలమని నవ్వు … ఆతలికొంటివా
లేక కరుణా స్వాంతః
మదగజగమన నాస్వామి ఓ సదయుడ
పిలోపి జాలియుదెల్పుమి।
నాకిలాలాడ రమ్మనిరి అడీ వరద
నీవు రావద్దు పొమ్మనిరి
ఎవరున్నన్ను యే పరిపాలన
… యెడ తప్పునని … వద్దటి॥
కనులు … నియాని దు కరమున
కంగని నేర మని కనరేద॥
కలువరేకులవంటిలు కనుల కలగాల
నిన్ను నెనదయాళో॥
నుదు ను శ్రీమజలముల ఆకరయేమి
దెయిలే కరజాలవాల।
చింతచే దాగును, వేరేమేని కాంతిచే
ఉగిన … వేరే॥
ముత్యాలసరులదిక్కుమీ ఓన వ్యన ధ
పాటనకల నొక్కపడ॥
ము ముకారే పటువేళనా, పదమున
వ్రాలెదరు పలుమారువేళ॥
ఓన్నిమాడి … చ్చొనరిరి రామ ముచ్చనతో
నేమని యెంచుగారి॥
బాగసాక్షి రమ్మ రి వరత్యాగరాజ
నుత దైవమా యనిరి॥
(కహాన-చాపు)

సర్వేంద్రియాలూ సకల ఉపకరణాలూ, శాటేలు అవయవాలవలె అంతరంగంలో లీనములై ఆ అంతఃరాత్మను చేరుకొంటాయి. దీనినే ఆత్మానందం అంటారు ఆత్మానుభవం అంటారు. శాశ్వతమైన మోక్షానంద సుఖానికి యిది ప్రతీ మనీ శాస్త్రజ్ఞులు. జ్ఞులు … చారు. ఆ అనుభవమే లాలి, జోజో, యీ … వ్యవస్థ చి.

జోజో రామ అనందఘన
జోజోజో రామ॥
జోజో … మ
జోజో భూజా లోలా రామ॥
జోజో రఘు కులతిలక …
జోజో కుటిలతర … రామ
జోజో నిర్గుణరూప రామ,
జోజో సుగుణకలాప రామ॥
జోజో రాజీవ నయన రామ,
జోజో ఫణిరాజ శయన రామ॥
జోజో మృదుతర భాషరామ,
జోజో మంజుల వేష రామ॥
జోజో త్యాగరాజార్చిత రామ,
జోజో భక్తసమాజ … మ॥
(రీతిగౌళ-ఆది)

లాలీ లాలీయని యూచేరా వనమాలి
మాలిమితో జూచేరా॥
దేవదేవయని బిలిచేరా మహాసుభావ
భావమున దలచేరా।
రామ రామయని బిలిచేరా, నిష్కామ
కామ పునుతరారా।
కోరికోరివిను గొలిచేరా సూయాదారి
దారి సజ్జనేరా॥
రాజరాజయని పొగడే … త్యాగరాజ
రాజయ్యా ప్రొమొకే …॥
(హరికాంభోజి-దేశాది)

ఇక శ్రీ మదంద్రమూర్తి యోగనిద్రావరవశులై యున్నట్లు తన ఆత్మానుభూతి పొందుతాడు ఆయోగ దాసుభవానికి యతికి లీల అంతయూన్ని. కలిగించిన ఆచారమేమో అది మన నప్పులో భావించి మరి యీ దివ్య యోగ నుభూతిని, యీ ఆత్మానందాన్ని సర్వులకూ అందించాలంటే పూజా కల్పంలో చిట్టచివరకు మంగళహారతి నియ్యడం ఆనాది సంప్రదాయం. ఆ హారతియందు యీ భావుకునియొక్క, యీ ఉపాసకునియొక్క ఉపాస్యమైన దైవముయొక్క, ఉభయులయొక్క ఐక్యత సమ్మేళనం పొందుతుంది. ఐక్యమౌతుంది ఆ ఐక్యానుభూతి తాలూకు చలన సమస్త జగానికి, సకల ప్రజలకూ, రాష్ట్రానికీ, దేశానికీ, సర్వ కాలము, నిత్య నూతనమైనటువంటి దైవసౌభాగ్యాన్ని, ఆనందాన్ని అందిస్తూనే వుంటాయి.

జయమంగళం నిత్య శుభమంగళం॥
కరుణా సాంద్రయ కామారినుతాయ
తరుణారుణాభి సుందరపాదాయ॥
నిరుపమశరీరయ నిఖిలాగమవేద్యాయ,
సురవినుత చరితాయ సువ్రతాయ॥
కుందసుమరదనాయ,
కుంభజ సుగేయాయ
మందరాగధరాయ మాధవాయ॥
కందర్పజనకాయ కామితఫలదాయ
బృందారకాధిపతిపూజితాయ॥
సర్వలోకహితాయ సాకేతసదనాయ
విద్వత్కారాయ మానితగుణాయ॥
సార్వభౌమాయ పోషితత్యాగరాజాయ
నిర్వాణఫలదాయ నిర్మలాయ॥
(ఘంటా-ఝంపె)
(సమర్పణ: మంచాల జగన్నాథరావు)

# ప్రసార విశేషాలు

## షిరీన్ - ఫర్‌హాద్

నాటకం

పర్షియాదేశంలో శిల్పకళాకారుడు ఫర్‌హాద్ ఒకసారి తన శిల్పకుటీరంలో రాకుమారి షిరీన్‌ని చూశాడు. కాలక్రమంలో వారి పరిచయం ప్రేమగా మారింది. ఈ ప్రేమ అవధులు దాటుతుందని శంకించి రాజు షిరీన్ ఫర్‌హాద్‌ల పరిచయాన్ని నిషేధించి రాకుమారికి పెళ్ళి ఏర్పాట్లు చేయిస్తాడు. ఈ సంగతి విన్న మెహరాన్ పాదుషా ఖుస్రూపర్వీజ్, షిరీన్‌ని పొందడానికి తన అనుచరులు షకర్, షమాల ద్వారా ప్రయత్నాలు సాగించాడు, కృతకృత్యుడయ్యాడు. కాని దేశబహిష్కారం చేయబడ్డ ఫర్‌హాద్ పిచ్చివాడై తిరుగుతూ మెహరాన్ చేరుకున్నాడు. ఈ సంగతి గ్రహించిన మెహరాన్ పాదుషా పెళ్ళిమీద పెళ్ళిచేసుకున్నందుకు ఖుస్రూపర్వీజ్‌పై కోపించి షిరీన్‌ని ఫర్‌హాద్‌కు వాపసు చేయవలసిందిగా ఆజ్ఞాపించాడు. చేసేదిలేక ఖుస్రూ అందుకు ఫర్‌హాద్ కొండత్రవ్వి అవతలవైపున ఉన్న వాగును మెహరాన్‌కి మళ్ళించాలని షరతు విధించాడు. ఫర్‌హాద్ ఆ పని పూర్తిచేశాడు. ఖుస్రూ ప్రయత్నాలు విఫలం కాగా, చివరకు షిరీన్ మరణించిందన్న అబద్ధపువార్త ఫర్‌హాద్‌కు షకర్ ద్వారా పంపేడు. ఈ వార్తవిని ఫర్‌హాద్ కొండకు తలపగల కొట్టుకున్నాడు. ఇంతలో ఖుస్రూకోటలో బంధించబడ్డ షిరీన్ తప్పించుకొని అక్కడికి వచ్చేసింది. కాని అప్పటికే ఫర్‌హాద్ కొనప్రాణాలతో ఉన్నాడు. విఫల ప్రేమలో తనువులు బాసిన అమర ప్రేమికులు షిరీన్-ఫర్‌హాద్‌ల గాథను 21-6-67 మధ్యాహ్నం 3 గంటకు ఆకాశవాణి హైదరాబాదు కేంద్రం ప్రసారం చేస్తుంది. విజయవాడ కేంద్రం ఈ కార్యక్రమాన్ని రిలే చేస్తుంది. నాటక రచన: శ్రీ చెరుకుమిల్లి భాస్కరరావు; నిర్వహణ: శ్రీ నండూరి విఠల్.

## నాదోపాసన

(5వ పుట తరువాయి)

యతి విశ్రమ సద్భక్తి విరతి
ద్రాక్షారసనవరస
యుతకృతిచే భజియించే యుక్తి
త్యాగరాజుని తరమా శ్రీరామ ॥
(శ్రీరంజని-రూపకం)

అనంతమైన విద్యలన్నీ మోక్షసాధకాలే అయినప్పటికీ, సద్భక్తియుక్తమూ, ప్రణవనాదపరిపూర్ణము, శివస్వరూపము, అయిన నాదవిద్యను ఉపాసించని వారికి మోక్షము ఎలా సాధ్యమౌతుందయ్యా - అంటున్నారు అయ్యవారు

మోక్షముగలదా భువిలో
జీవన్ముక్తులు గానివారలకు ॥
సాక్షాత్కార నీ సద్భక్తి
సంగీతజ్ఞాన విహీనులకు
ప్రాణానల సంయోగమువల్ల
ప్రణవనాదము సప్తస్వరములై బరగ
వీణావాదనలోలుడౌ శివమనో
వితమెరుగరు త్యాగరాజనుత ॥
(సారమతి-దేశాది)

అయ్యవారు, మనస్సునుద్దేశించి:-
అతి చంచలమైన ఓ మనసా!

ఏకాగ్రతను అలవరిచే సంగీతవిద్య సీతాపతి దయచేగాక ఎలా లభిస్తుంది? లభ్యమైన ఈ అదృష్టాన్ని పొందిన పరమశివుడు ఎంత ధన్యుడో గదా — అన్నారు.

రాగసుధారస పానముచేసి
రాజిల్లవే ఓ మనసా ॥
యాగయోగత్యాగభోగ
ఫలమొసంగే ॥
సదాశివమయమగు నాదోంకారస్వర
విదులు జీవన్ముక్తులని త్యాగరాజు
తెలియు ॥
(ఆందోళిక-దేశాది)

స్వర, రాగ, లయ, అనే సుధారసంలో రామనామమనే కండచక్కెరను మిశ్రమంచేసి అనుభవించిన ఓంకారస్వరూపుడైన శివునకుగాక తదితరులకు నాదోపాసనలోగల పరమానందాన్ని వివరించడం ఎవరికైనా ఎలా సాధ్యం? అంటున్నారు అయ్యవారు.

ఇంతసౌఖ్యమని నే జెప్పజాల
నెంతో యేమో యెవరికి దెలియునో ॥
దాంతా సీతాకాంతకరుణా స్వాంత
ప్రేమాద్యులకే తెలియునుగాక ॥
స్వరరాగలయ సుధారసమందు
వరరామనామమనెడు కండచ
క్కెరమిశ్రముచేసి భుజించు శంకరునికి
తెలియును త్యాగరాజనుత ॥
(కాపి-ఆది)

నాదస్వరూపుడవైన ఓ పరమాత్మా! శ్రీ రామచంద్రమూర్తీ!

నీలమేఘశ్యాముడవై దరహాసిత వదనారవిందుడవై, వామాంకమున మా తల్లి సీతమ్మ, పదపద్మాలవద్ద పవమానసుతుడు, సన్నిధిని నారదాది భక్తులతో కొలువైయున్న మిమ్ము సేవించు భాగ్యాన్ని పొందిన త్యాగరాజస్వామివారు నాదోపాసకులు జీవన్ముక్తులు.

నీ నామరూపములకు
నిత్యజయమంగళం
పవమానసుతుడు బట్టు
పాదారవిందములకు
పంకజాక్షి నెలకొన్న
అంకయుగమునకు
నవముక్తాహారములు
నటియించే యురమునకు
నళినారిగేరు చిరునవ్వు గలమోమునకు
ప్రహ్లాదనారదాది భక్తులుపొగడుచుండే
రాజీవనయన త్యాగరాజవినుతమైన ॥
(సౌరాష్ట్ర-ఆది)

ఇతి శివమ్.



ఎస్. సి. హెచ్. సత్యనారాయణ గాత్రం [... దాస్, మే ...]

# పుస్తక పరిచయము

## ఇది చదివారా?

వి. శకుంతల

ఈనాడు మీకు పరిచయము చేయనున్న రెండు పుస్తకాలలో ఒకటి శ్రీ ముద్దుకృష్ణగారు సంకలనముచేసిన ౧౦ నాటికల సంపుటి. సాహిత్య అకాడమీ అధ్వర్యాన శ్రీ ఎమ్. ఎస్. శేషాచలం కంపెనీవారు ప్రచురించిన యీ పుస్తకము వెల మూడు రూపాయలు. రెండవ పుస్తకము శ్రీమతి ఇల్లిందల సరస్వతీదేవిగారు రచించిన వెలుగుబాటలనే వనితాలోకాన్ని ఉద్దేశించి వ్రాసిన 29 వ్యాసాల సంపుటి. ఈ పుస్తకముకూడ శ్రీ ఎమ్. ఎస్. శేషాచలం కంపెనీవారే స్వంతంగా ప్రచురించారు. దీని వెలకూడా మూడు రూపాయలే.

ఈ పది నాటికలని రచించినవారు ఈ నవీనకాలంలో తెలుగుసీమలో నాటిక రచయితలుగా పేరు పొందినట్టి ప్రముఖ వ్యక్తులు. ఈ గ్రంథాన్ని సంకలనుచేసిన శ్రీ ముద్దుకృష్ణగారు రచించిన అనార్కలియేగాక శ్రీ రాజమన్నాగారు రచించిన ఏమి మొగ వాళ్ళు, శ్రీ నార్ల వెంకటేశ్వరరావు గారు రచించిన ప్రారబ్ధం, శ్రీ చింతా దీక్షితులుగారు రచించిన శర్మిష్ఠ, శ్రీ విశ్వనాథ కవిరాజుగారు రచించిన నాటిక నేడు శ్రీ చలంగారి పంకజం, శ్రీ కొప్పరపు సుబ్బారావుగారు రచించిన అల్లీ ముఠా, శ్రీయుతులు రమణారెడ్డిగారు, శ్రీ డాక్టర్ వేణుగారు జంటగా రచించిన రాజీవం, శ్రీ ఆచార్య ఆత్రేయగారు రచించిన ఎవరుదొంగ, శ్రీ ఆమద్రగారు రచించిన దేవుని ఎదుట, ఈ పది నాటికలు నేటి తెలుగు నాటికలలో కానవచ్చే వైవిధ్యాన్ని ప్రతిబింబిస్తాయి. ఇక నాటికల ప్రశస్తికి వద్దాం. మొట్టమొదట శ్రీ రాజమన్నారుగారు రచించిన ఏమి మగవాళ్ళు తీసుకుందాం. న్యాయవాదవృత్తిలో ప్రధాన న్యాయమూర్తిగానేగాక సాహిత్యంలోను, కళలలోను ఎంతో పేరు సంపాదించుకొన్న శ్రీ రాజమన్నారుగారు తెలుగు పాఠకులందరికి చిరపరిచితులు. లోలోపలుండే కోరికలను అణచుకొని సంఘమర్యాదల కోసం నాటకమాడే పెద్దమనుష్యులు రహస్యంగా అవకాశం దొరకగానే ఎటువంటి కక్కుర్తికి పాల్పడుతారో ఏమి మగవాళ్ళు నాటిక వెల్లడిస్తుంది. ధర్మశాస్త్రాలన్నీ బాగా చదివేనని ప్రగల్భాలు పలికే 60 సంవత్సరాల ముసలివాడు వావివరుసలు లేకుండా తన అన్న కుమారుడు ప్రేమించి పెళ్ళిచేసుకొన్న వేశ్యపై మోహావేశం పెంచుకొంటాడు. ఇక అతని రెండో పెళ్లి పడుచుపెళ్ళాం అతని తము ఒపై ప్రేమ కురిపిస్తుంది. అంతే కొందరి వ్యక్తుల చపల బుద్ధి, అవకాశాలు దొరికితే ఎంత సాహసానికి అవినీతికి దారితీస్తుందో యీ నాటిక నిరూపిస్తుంది. ఇందులో సంభాషణలు చాలా బాగా నడిచాయి. సందర్భములన్నీ చాలా సమంజసంగా ఉన్నాయి. అందరి పాత్రపోషణ చాలా బాగా జరిగిందని చెప్పాలి. ఇందులో కొద్ది మార్పు చేయగలిగితే ముఖ్యంగా ప్రేమ, కామానికి సంబంధించిన ఘట్టాల్లో మార్పు చేయగలిగితే ప్రదర్శనానుగుణ్యంగా ఉంటుంది. కాని ఈ నాటిక విద్యార్థులు చదవటం ముఖ్యంగా వేశ్యలు, కామోత్రిక్త చేష్టలను గురించి తెలుసుకోడం ఎంతవరకు సమంజసమో ఆలోచించాలి.

ఇక రెండో నాటకం. శ్రీ నార్ల వెంకటేశ్వరరావుగారు రచించిన ప్రారబ్ధం. పత్రికా నిర్వహణ ద్వారాను. రకరకాల పాత్రలను సృష్టించే శ్రీ నార్లగారిని ఎరగని వారు లేరు. ఆధునికవిజ్ఞాన ప్రయోజనాన్ని అర్థం చేసుకోలేక మూఢనమ్మకాలతో మనిషి పాతవిధానాలను అనుసరించి కర్మమనీ, ప్రారబ్ధమనీ విశ్వసించటంవల్ల కలిగే ప్రమాదాలన్ని యీ నాటిక స్పష్టంచేస్తుంది.

ఇక మూడవ నాటకం.... శ్రీ చింతాదీక్షితులుగారు రచించిన శర్మిష్ఠ. బాలవాఙ్మయమును సృష్టించి, అనేక రసవత్తరమైన కథలు, నాటికలను రచించిన శ్రీ చింతా దీక్షితులుగారు పౌరాణిక నాటికను వ్రాయటంలో కూడా అందెవేసిన చెయ్యి. పురూరవుడు, శర్మిష్ఠ, యయాతి వీరికథ ఆధారంగా శర్మిష్ఠ అనే యీ నాటికను వ్రాశారు. పటుత్వం సడలిన ముసలితనానికి బాధపడి కుమారుని యౌవనాన్ని తాను తీసికొని సుఖాల్ని అనుభవించాలని ప్రయత్నించే భర్తపరాభవాన్ని యీ నాటిక బయటపెడుతున్నది. ఇది రంగస్థల ప్రదర్శనానికి యోగ్యంగా యున్నది. ఇందులో పాత్రలు ముగ్గురే అయ్యుండడాన్నిబట్టి ఇక ఇతరహంగుల సహాయాలు లేకుండానే అర్థం అవగలిగే అవకాశం ఉండడాన్నిబట్టి యీ నాటిక శ్రవ్యనాటికగా కూడ ప్రదర్శనయోగ్యంగా ఉన్నది. సంభాషణలుకూడ చిన్నవిగా, సులభంగా అర్థమయ్యేటట్లుగా యున్నవి. పాత్రధారులు పాత్రపోషణ బాగుగా యున్నదని మెప్పుపొందగలరు. అయితే పాఠకులు, సభికులు, ప్రేక్షకులు, శ్రోతలు యీ నాటికను సరిగ్గా పూర్తిగా అర్థం చేసుకోవాలి. అందుకోసం కొంత పూర్వగాథ తెలియవలసిన అవసరం ఎంతయినా యున్నది అందుకు యీ నాటిక ప్రదర్శనకు ముందు యీ కథను పరిచయం చేయవలసియుంటుంది. కాబట్టి యీ కొద్ది మార్పుచేస్తే ఇది చాలా యుత్తమమైన నాటకమని చెప్పవచ్చు.

నాలుగవ నాటకం... శ్రీ విశ్వనాథ కవిగారు రచించిన నాటిక నేడు అనే నాటిక ఆంధ్రనాటక కళాపరిషత్తు ప్రారంభానికి ముఖ్యకారకులైన వీరి నాటికలు చాలావరకు ప్రజాదరణ పొందాయి. విషమపరిస్థితులలో పడిపోయి విడిపోయిన ప్రేయసీ ప్రియులు వారి వయస్సంతా గడచిపోయిన తర్వాత తిరిగి హఠాత్తుగా కలుసుకుంటే వారి ప్రణయం ఎలాగ అలోచిస్తుందో ఈ నాటిక స్పష్టంచేస్తుంది.

ఐదవ నాటిక శీర్షికలో....శ్రీ గుడిపాటి వెంకటాచలంగారు రచించిన పంకజం అనే నాటికఒకటి. స్త్రీ పురుష సంబంధాలకు సంఘం కల్పించిన కట్టుబాట్లను తీవ్రంగా ఖండించటానికి పూనుకొన్న శ్రీ చలంగారు ఆంధ్ర పాఠకలోకానికి పరిచితులే. భార్యాభర్తలమధ్యయుండే అనుబంధంకన్నా తల్లికి పిల్లకి మధ్యేయుండే ప్రేమ అతీతమని ఆ పిల్లకోసం తల్లి ఎంతటి త్యాగాన్నైనా చేస్తుందని ఈ నాటిక వ్యక్తం చేస్తుంది. కథ సూక్ష్మంగా ఏమిటంటే-ఇద్దరు దొంగలు శోభనపు గదిలో ప్రవేశించి వధువు శీలాన్ని భంగపరచటం. తత్ఫలితంగా భర్త ఆమెను విడవడం, ఆమె గర్భవతై తను కన్న కుమారునిపై ప్రేమ పెంచుకొని ఆ పసివానికై ఎన్నో త్యాగాలను చేసి, పిరికివాడై సంఘం కట్టుబాట్లకు లోనైన భర్తకన్నా, ఆ పసివానిపై ప్రేమ అధికమని చూపటం. ఈ నాటకంలోని పాత్రలు సంభాషణలు బాగు

న్నవి. శ్రీ చలంగారిలాగే అందరూ సంఘాన్ని ధిక్కరించి విమర్శించ లేము, కాబట్టి ఇది బహిరంగంగా ప్రదర్శించటానికి సాధ్యపడదు. రచయిత చిన్న సత్యాన్ని చూపటానికి చాలా క్లిష్టమైన దౌర్జన్యమైన సంఘటనలు కల్పించటం వాస్తవికతకు దూరంగా ఉందని చెప్పక తప్పదు.

ఇక ఆరవ నాటిక....శ్రీ కొప్పరపు సుబ్బారావుగారు రచించిన అల్లీముఠా. ఈ రచయిత నాటక రచనలోను, నాటక ప్రదర్శనలలోను ప్రత్యేక కృషిచేసిన ప్రతిభావంతులు. నాటక ప్రదర్శనాలలో యువతీ యువకుల్ని ప్రోత్సహించి మన గ్రంథాలయాల్లో ఉత్తమ నాటక గ్రంథాన్ని చేర్చి జీవితమంతా నాటకాలకే అర్పించిన ధన్యజీవి. అల్లీముఠా అనే యీ నాటిక-శాస్త్రం చట్టం అనే వారివి తమకు అనుకూలంగా ఉపయోగించుకొని, వాటికి ప్రతికూలమైన ప్రయోజనాల్ని పొందడానికి నాటకమాడేవారి దుర్మార్గాన్ని దుయ్యబట్టుతుంది హాస్యమిళితమైన ప్రజాదరణపొందే జానపద గేయాల శైలిలో ఈ రచయిత పాటలు రచించి సంఘంలోయున్న ఇబ్బందులు అవినీతిని వెల్లడిచేశారు మగలోకృని మాట పేరండీ నరులార.చూడు సంగతివి మీరాలకించండి అనే పాట ద్వారా న్యాయంగా బ్రతకదల్చుకున్న వారి ఇబ్బందుల్ని చాటేరు.

దొంగలని అంటారురా దొరలు
దినసలా మాటకీ
బీదసాదల దోచకుండే బిరుదు
దొర లెటులైరా?
దొంగదొర అననేలరా? దొంగలే
అంటామురా
పగటి దొంగలువారురా, మరి
రాత్రి దొంగలు మనమురా....
అనీ....
అడవి మృగములు చూడరా కడుపు
నిండితే తినవురా
బిరుదు అందిన మనుజ మృగములు
ధరణినంతా మ్రింగురా....



టి. కె. వేణుగోపాల దాస్ ధ్రువరాజ కథా కాలక్షేప
[బెంగుళూరు మే 21]

సంఘంలో వున్న అవినీతి నంతా వీటిద్వారా వెల్లడించారు. అంతేగాక.

వద్దుర మనకీ దొంగతనం-ఇక
వద్దుర మనకీ దొంగతనం ...
ఇల్లు కదలకయె ఇలను దోచుకొను
ఇతర మార్గములు కలవుర భాయీ—

అనీ—

శాస్త్రం చట్టం సమ్మతించితే
దొంగయే దొరరా భాయీ—

అని—పైకి కనబడకుంటే ప్రజాసేవకుల్లా నటిస్తూ ప్రజలను దోచుకునే వ్యక్తులనీ, పైకి చూపించారీ రచయిత. ఈ నాటిక సంభాషణద్వారా అయితేనేమి, సులభంగా అర్థమయ్యే పాటల ద్వారా అయితేనేమి ప్రేక్షకుల్ని మనం దవరిచి రంజింపజేయగలరు. అనేక రంగస్థలాల్లో ప్రదర్శించబడి ప్రజాదరణ పొందింది. స్త్రీ పాత్ర లేకపోవటంవల్ల ప్రదర్శనకు ఇంకా వీలుగా ఉన్నది నాటకాభిలాష దృష్టిలో యీ నాటక విశిష్టత ఏకాలాని కైనా వర్తించే నాటకమని అనిపిస్తుంది. ఈ శీర్షికలోనుండే పది నాటకాలలోను ఇది గొప్పదని నా అభిప్రాయము.

ఈ నాటకాలను సంకలనంచేసిన శ్రీ మధుకృష్ణగారు రచించిన అనార్కలి తరువాతది. జ్వాలా పత్రిక ద్వారా, వైతాళికులనే ఆధునిక కవుల ఉత్తమగీతాల సంపుటిద్వారా ఈ రచయిత అందరికి పరిచయస్థులే. అంతేగాక యీ పది ముఖ్య నాటకాలను సేకరించి కూర్చి ప్రచురణకు అవకాశాన్ని కల్పించినందుకుకూడ ఈయనకు ధన్యవాదాలు అర్పించవచ్చు. ఈ నాటికలో కథావస్తువు చరిత్రాత్మకమై ప్రసిద్ధిగన్న అనార్కలి సలీం ప్రణయగాథ ఈ కథ పలు నాటకాలద్వారా సినిమాద్వారాకూడ పరిచయమైనదే. ప్రేమకోసం కుమారుడు, ప్రజాభిప్రాయంకోసం, సామ్రాజ్యక్షేమం కోసం తండ్రి విషమపరిస్థితులలో పడి ఒక అమాయకురాలి జీవితాన్ని అన్యాయంగా విషాదాంతంచేసిన చరిత్ర ఈ నాటిక చిత్రిస్తుంది. అందరికీ తెలిసిన కథా వస్తువు అవడాన్నిబట్టి యీ నాటికలో ప్రేక్షకులను రంజింపజేయాలంటే పాత్రపోషణ ముఖ్యంగా వారి సంభాషణ అతి పటుత్వంగా ఉండాలి. ఈ రచయిత ఈ లక్ష్యాల్ని సాధించారనే చెప్పవచ్చు ఉదాహరణకి....: పాలితులైన ప్రజలదృష్టిలో— చక్రవర్తిత్వం వజ్రంవంటిది. కన్నులు మిరుమిట్లుకొలిపే కాంతితో కూడినది. అంతేగాక వజ్రంవలె మహాకఠోరమైన కఠినత్వంతో కూడిన —అనే అక్బరు చక్రవర్తి పలుకులు....నేను విస్తారంగా చదువుకొన్నదానను కాను. తమవద్ద సరిగా చెప్పలేకున్నాను —అంటూనే పవిత్రప్రేమను, అమూల్యమైన దాంపత్యశక్తిని చాటే అనార్కలి విజ్ఞాపన. సామ్రాజ్యమే మా కీర్తి. ప్రజలే మా బాధ. సహజమానవత్వం మాలో నశింపు ఈ నాటినుంచి....అనే సలీం ఆవేదన యీ నాటికలోని పాత్రల పటుత్వాన్ని చాటుతాయి. ఈ నాటిక ఉన్నపాటున ప్రదర్శనకు శ్రవ్యనాటికా ప్రసారానికి తగియున్నది అందరికీ తెలిసిన కథావస్తువైనా యీ నాటిక చదువుతున్నా, చూస్తున్నా, వింటున్నా కొత్తదనముందని అనిపించి అందరిని ఆకర్షించగలదు.

ఎనిమిదవ నాటిక శీర్షికక్రింద శ్రీ వెంకటరమణారెడ్డిగారు, డాక్టరు వేణుగారు రచించిన రాజీవం నే నాటిక వస్తుంది అన్యాయపరిస్థితులలో చిక్కుకున్న స్త్రీ జీవితం ఆమెను ఎలాగ దిగజార్చివేసి దిక్కులేనిదానిగా చేస్తుందో యీ నాటిక తెలియజేస్తుంది— నీతులు బోధించకు నరహరీ. పుణ్యం ఉంటుంది —రేపో మాపో మనం ముసలాళ్ళు కానున్నాం కాకతప్పదు. ఒంటిలో వేడీ, కంటిలో వాడీ తగ్గకముందే అందాన్ని పిండి అందాన్ని వడగట్టి తాగాలని—అంటూ జీవితమంతా నీతితోనైనా, లేక అవినీతితోనైనా అనుభవించాలని దయానిధి అనే పాత్ర. శివశివ. ఒక్క పెళ్ళాంతో నెట్టుకొస్తున్న మేమంతా అప్రయోజకులమన్నమాట—అని నరహరి నీతిబోధ. ఆడపిల్లల చదువులకు అత్యంత రాలు పుండకూడదు ఈ యువతరం, ఈ క్రొత్తతరం, ఈ కుర్రకారు. కలిసికట్టుగా ఏకతాటిమీద ఏకగ్రీవంగా అబలలైన స్త్రీలను సంస్కారవంతులుగాను విద్యావంతులుగాను, నాగరికులుగాను తయారుచేస్తే భారతనారి శిఖరం చేరుతుంది. గాంధీజీ ఆత్మ సంతోషి

స్తుం—అనే ఇటువంటి సంభాషణలు బాగా సాగాయి. నాటకం ఎక్కడా విసుగుపుట్టించదు. కానీ ప్రదర్శనార్హత విషయం బాగా ఆలోచించవలసి వుంటుంది. కొన్నికొన్నిచోట్ల అసభ్యపు పలుకులు సంభాషణలు మార్చవలసి ఉంటుంది.

తొమ్మిదవ నాటిక శీర్షిక శ్రీ ఆచార్య ఆత్రేయగారు రచించిన ఎవరు దొంగ అనేది. సాంఘిక నాటిక రచన నిర్వహణలో పేరు సంపాదించిన ఈ రచయిత నాటిక రచనకు, సినిమాలకు సంభాషణలు వ్రాయడంద్వారా అందరికీ పరిచయస్థులే. భార్యాబిడ్డల ప్రాణాన్ని కాపాడడానికి కాస్త దొంగతనంజేసిన భర్త విషాదగాథనే, పలుకుబడిగలవారు పెద్ద ఉద్యోగస్థులు కలిసి ధనకాంక్షతో ప్రజల జీవితాలు బాధాకరం చేస్తుంటేను న్యాయంగా ప్రజాక్షేమంకోసం పాటుపడే ఉద్యోగస్తుడు ఎలా అన్యాయం పాలౌవుతాడని యీ నాటిక విశదంచేస్తుంది. ఈ నాటిక రాసింది కొన్ని సంవత్సరాలక్రితమైనా ఆహారసమస్య తలెత్తుకొనే యీ సమయంలోకూడ యీ నాటిక సమంజసంగా ఉంటుంది. కాని నాటిక దృష్ట్యా ఆలోచిస్తే ఇందులోని సన్నివేశాల్ని ప్రజాదరణకోసం ఎంతోదూరం తీసుకుపోయారు రచయిత, ఒకొక్కప్పుడు అంత తీవ్రమైన సంఘటనలు అవసరం లేకపోయినా ఆ పాత్రలపై ప్రేక్షకులకు సానుభూతి యుంటుంది. ఇక అవినీతిని నిందించాలని ప్రయత్నిస్తూ రచయిత కొన్ని రాజకీయపార్టీలపేర దొర్లించారు ఇది ప్రజాస్వామ్యంలో తప్పుగా తోస్తుందేమో. ఎన్నో ఆదర్శాల్ని నీతుల్ని తీవ్రంగా చెప్పాలని ఉద్రేకపూరితమైన పాత్రలను సృష్టించడంవల్ల రచయిత యీ నాటికలో తన లక్ష్యాన్ని పూర్తిగా సాధించలేదేమో

ఇక ఆఖరి నాటకం దేవుని ఎదుట అనే శీర్షికతో శ్రీ ఆరుద్రగారు రచించింది. నాటకాలు సాహిత్యసేవ గేయ రచనద్వారా శ్రీ ఆరుద్రగారి పేరు మనమందరు విన్నదే. సమాజంలో ఉండే అన్యాయాలపై తిరుగుబాటుచేసే వారికి కలిగే బాధలన్నీ ఏ మార్పు వచ్చినా దాన్ని స్వార్థపరులు ఉపయోగించుకొనే తంత్రపుగొడ్డుతనాన్ని ఈ నాటికబయటపెడ్తుంది. పక్షపాతంగా ఉండే న్యాయస్థానంలోకూడా వ్యక్తి యొక్క సంఘస్థానాన్నిబట్టి న్యాయనిర్ణయమవుతుందని రచయిత చెప్పదల్చారు. సంభాషణలన్నీ సరిగా సాగాయని చెప్పాలి. కానీ కథా సంవిధానం విశదంగా లేదుకాబట్టి ప్రేక్షకులకు కాస్త సందిగ్ధంగా యుండవచ్చు. నాటకం అనేకచోట్ల వాస్తవికతకు దూరంగాయున్నట్లుఅనిపిస్తుంది, ఎక్కువ పాత్రలు భిన్నభిన్న లక్ష్యాలతో యుండడంబట్టి రకరకాల సన్నివేశాలు ఏర్పడి ప్రేక్షకులకు స్థిరమైన భావాలు ఏర్పడవు

ఈ పది నాటకాల సంపుటి నాకు అర్థమయిన రీతిగా పరిచయం చేయాలని ప్రయత్నించాను. మిమ్మల్ని కోరేదేమంటే ఇవి మీరు చదివి తెలుగుసీమలో ఉన్న విభిన్న అభిరుచులు కల నాటికలద్వారా సంఘసేవ చేయటానికి ఎంతవరకు వీలున్నదో పరిశీలించాలి.

రెండో పుస్తకం శ్రీమతి ఇల్లిందల సరస్వతీదేవిగారు రచించిన వెలుగుబాటలు. ఇది వనితాలోకాన్ని ఉద్దేశించి వ్రాసిన 29 వ్యాసాల సంపుటి. ఇందులో పిల్లల్ని పెంచటం, వంటయింటి విశేషాల దగ్గరనుండి అంతర్జాతీయ వైజ్ఞానిక విశేషాలవరకు ప్రఖ్యాతికెక్కిన వ్యక్తుల జీవితగాథలన్ని ఇంకా ఎన్నో విశేషాలన్ని యీ వ్యాసాల్లో చర్చించారు రచయిత. ఇవన్నీకూడా ఆమె అప్పుడప్పుడు మహిళామండలి కార్యక్రమాల్లో ప్రసారంచేసినవి జాతీయాభ్యుదయానికి విద్య, ఆహార ఆరోగ్యము ఈ సమస్యల్ని పరిష్కరించటానికి మనమేమి చేయాలనే విషయాలని గురించి మనకు నిజంగా వెలుగుబాట చూపిస్తుంది గ్రంథం. ఆయుర్వేద ఆహార విషయాల్లో తెనుగువారి భోజన విషయాలు చక్కగా వర్ణించబడ్డాయి.

మును జిగురున ఇవ్వనో
మనగాయం దొరపండ్ల మడియారగ బదిన వండ్ల నెల్లకాలము
దధియగ జవ్విలొసగ వాంఛ
తళ్ళవులు గలదే?

ఈ పద్యం కొలని గోపరాజు సింహాసనద్వాత్రింశిక అను గ్రంథంలో నున్నది. గరిక చపికద, మామిడికాయ ఊరగాయ, తరవాణి. ఉప్పుతో తొమ్మిది, పప్పుతో పది వంకాయకూ పరికూచుకీ పిగ్గపిటి, కొయ్యతోటకూరకు కొడపలకీసిగ్గులేదు. కందులేని దరద బచ్చలికేల-యిలాంటి సామెతలు మనకు సన్నిహితమైన వాక్యాలతో మన నిత్య జీవిత విధానంలో వినియోగించే పదార్థాల వైవిధ్యాలతో మనల్ని వాటి వ్యాసాలపట్ల ఆకట్టుకొంటాయి అట్లాగే గర్భిణిస్త్రీలకు అవసరమైన వ్యాయామ విశ్రాంతి క్రీడలు. బాలబాలికల ఆహారాభ్యాస విధానాల్ని గురించి స్త్రీ మాతృదేవత అనే మహోత్తమ భావాల్ని ఉద్ఘాటిస్తూ. స్త్రీ విద్య, నవీన సాంఘిక దేశపరిస్థితుల కనుకూలంగా రూపొందించవలసినదని. సోపపత్తికముగా నిరూపించిన విషయము విద్యాశాఖ వారుకూడ ఆమోదించవలసిన రీతిగా నున్నది.

విజ్ఞానప్రదములూ, మనోవికాసహేతువులూ విశేష విషయ సంకలితములూ, విశిష్టములూ అయిన సరస్వతీదేవిగారి రచనను వనితాలోకం ఆమోదించగలదని అభిప్రాయపడుతున్నాను.



నిడదవోలు సర్వేశ్వరరావు: అఖిల భారత నాటక "జలవిహారం" అనువాదకులు, (ఇటీవల హైదరాబాద్ కేంద్రం నుండి ప్రసారితం)



ఎస్. ఎ. మహదేకర్: హిందూస్థానీ సంగీతం.
[హైదరాబాద్, మే 2]




మే 16-వ తేదీ సోమవారం నుండి మే 31-వ తేదీ బుధవారం వరకు

I వ ప్రసారము
ఉ|| 7.00 నుండి 9.30

II వ ప్రసారము
10-15 నుండి 1230 వరకు

III వ ప్రసారము
మ|| 2.00 నుండి 5.30

IV వ ప్రసారము
సా|| 6-30 నుండి 10-40

శనివారములు IV వ ప్రసారము
6-30 నుండి రా|| 11-10 వరకు

ప్రసారము I
7.00—8.30
49.71 మీ (6085 కిలో సై)
7.00—9.30
41.32 మీ (7160 కిలో సై)

7-00 వందనవార్ భక్తిగీతావళి
7-30 అర్చన
7-40 ఝలక్ కార్యక్రమ విశేషాలు
కావ్యమాధురి
[ఆదివారంములలో]
జీవన్ జ్యోతి
[మిగతా రోజులలో]
7-45 ఉదయగాన్
8-00 మంజూషా
జానపద ప్రాంతీయ సంగీతం
8-15 హిందీలో వార్తలు
8-30 జయమాల
9-30 ప్రసార సమాప్తి

ప్రసారము II
10-15—12-30
31.55 మీ (9510 కిలో సై)

10-15 వనవంతి
10-30 రంగ్ తరంగ్
10.15 హిందీలో వార్తలు
10.50 సంగీత సేతు

ఆదివారాలు ముఖ్యమైన పండుగ దినాలు

11 00 చిత్రధ్వని
సంక్షిప్త శబ్దచిత్రం (హిందీ)
(ప్రతి నెలా 1, 3, 5 ఆదివారములలో పండుగ రోజులలో)

రత్నకర్
సంగీతం, హాస్య రచనలు, పాటకథలు
(ప్రతి నెలా 2, 4 ఆదివారాలు పండుగ దినాలు)

12-00 జయమాల

12-30 ప్రసార సమాప్తి

మ|| ప్రసారము III
31.25 మీ (9600 కిలో సై)
31.33 మీ (9575 కిలో సై)

(ఆదివారాలు పండుగ దినాలు)

2-00 అప్నాఘర్
మీ యింట్లో అందరికి
(వారములోని ఇతర రోజులలో)

2-00 ఫుల్వారి సంగీత కదంబం
(వారంములో అన్నిరోజులలో)

2-30 మనోరంజన్
3-30 చౌవరా పాటలు, పాటలు

కర్ణాటక సంగీత కార్యక్రమము

[illegible]45 అంజలి-గీతావళి

4.00—5.30
31 20 మీ (9615 కిలో సై)
4.00—4.30
31.33 మీ (9,575 కిలో సై)

4-00 గీతమాలిక
4-30 మనచాహాగీత్
మీరు కోరిన పాటలు
((ఆది, బుధ, శుక్రవారములు)
5-30 ప్రసార సమాప్తి

సా|| ప్రసారము IV

6-30—9-30
31-33 మీ (9575 కిలో సై)
6-30—10-40—11-10
49.30 మీ (6085 కిలో సై)

6-30 జయ భారత్
జాతీయ సమైక్యతా గీతాలు
6-45 జయమాల
యుద్ధ వీరులకు
7-45 వాద్యమాధురి
వాద్య కదంబం
8-00 గజల్

8- 5 హిందీలో వార్తలు
8-30 మెహఫిల్ కదంబం
8.55 చిత్రశాల
రేడియో కార్యక్రమము
9.00 జలతరంగ్ పాటలు
9.15 హవామహల్
నాటికలు, రూపకములు హాస్యరచనలు
9-30 మనచాహా గీత్
మీరు కోరిన పాటలు
10-30 నూపుర్
10-35 హిందీలో వార్తలు
10-40 ప్రసార సమాప్తి

శనివారములు

10-30 గీతాంజలి లలిత సంగీతం
11-00 నూపుర్
11 05 హిందీలో వార్తలు
11-10 ప్రసార సమాప్తి

బెంగుళూరు—బి
365.9 మీ (820 కిలో సై)
వివిధభారతి (రిలే)

| | | |
|---|---|---|
| ప్రసారము | I | ఉ|| 7.00 నుండి 9.30 |
| ,, | II | ,, 10.15 నుండి 12 0 |
| ,, | III | మ|| 2.00 నుండి 5.30 |
| ,, | IV | సా|| 6-30 నుండి 10.40 వరకు |

శనివారం మాత్రం IV ప్రసారం రా|| 11-10 గంటల వరకు

ఇతర వివరములకు ప్రొడ్యూసర్, 'వివిధభారతి' ఆకాశవాణి, పోస్ట్‌బాక్స్ 4, బొంబాయి-1

Printed at Arutperunjothi Press, Madras-1—Edited and Published by the Station Director All India Radio, Madras-4.



సేలం ఎస్. జయలక్ష్మి: గాత్రం [మద్రాస్, మే 21]



"వివిధభారతి"లో జయమాల కార్యక్రమము నేమర్పించు సినితార కాంచన



నేదునూరి కృష్ణమూర్తి
[విజయవాడ, మే 26]



వింజమూరి శివరామారావు: రచన: ప్రాగ్ దీపిక
(సంగీత రూపకం) [విజయవాడ మే 23]



వోలేటి వెంకటేశ్వర్లు: సమర్పణ: రుక్మిణీకల్యాణం
(మేలట్టూర్ సంగీత నాటిక)



ఎస్. బాలచందర్: వీణ [మద్రాస్, మే 26]

# చాచా నెహ్రూ పవిత్ర స్మృతి

Regd. No. M. 5404




అమరజీవి నెహ్రూ

చిత్రకారుడు : దాసరి నాగవర్ధనరావు

[నెహ్రూ మూడవ వర్ధంతి సందర్భమున మే 27 వ తేదీన ఆకాశవాణి వివిధ కేంద్రాలనుండి ప్రత్యేక కార్యక్రమములు వినవచ్చును]